మ॥ దరహాసాంకురపూరముల్ నెఱపు ని ♦ ద్దంబైన నెమ్మోముతో
సరసంబైన ప్రసన్నవీక్షణముతో ♦ సౌహార్ద చిత్తంబుతో
హరుసంబుఁ గలిగింపు నామదికి! నీ ♦ కై చేయఁగాఁబోని దు
ష్కరకార్యం బొక్కఁడైన నాకు రహియిం ♦ చన్ బోదు సత్యమ్ముగన్. 182

సీ॥ అక్కఱైనపుడు నీ ♦ వ్యయమునకై దాఁచి
కడఁగనుంచిన ధనా ♦ గార మనుచు!
మనసును విప్పి సం ♦ భాషించి యన్యోన్య
హర్షమిఁగలుగు వ ♦ యస్య యనుచు!
వలగొన్న నీమనో ♦ వ్యథఁదొలఁగించి యు
పశమన మిడెడు హృ ♦ ద్బంధు వనుచుఁ!
బరమాయురారోగ్య ♦ భాగ్యంబునీకగు
నని కోరుకొను సర ♦ ళాత్మయనుచుఁ!

గీ॥ దలఁచి సమయాసమయముల ♦ వెలితిలేక-
భేదమెంచక-పనిగొని ♦ వేయుగతుల
సాయమొనరించి సేవింప♦సదవకాశ
మిచ్చి-యిరువుర సౌఖ్య మూ ♦ హింపు మీవు!” 183

క॥ అని - యరమర లేకుండఁగఁ
దనహృదయము విప్పి పలుకు ♦ తరళేక్షణ మో
మును బరమాదరమునఁ గను
గొని నలినీరంజనుండు ♦ కుతుకం బలరన్! 184

క॥ “పరమాహ్లాదకములు-నా
దర మేదురములును-నవసు ♦ ధా మధురములున్ -
నిరతజగత్ప్రియములు - సుం
దరి! నీమాటలకు నేను ♦ దనిసితి-మివులన్! 185

“నివేదనము”

ఉ॥ నాయెడ నీవుచూపెడు మ♦నఃపరితోషము - మైత్రివృత్తిధో
రేయత-చిత్తముం గఱచు ♦ ప్రీతియు - సేమముగోరు భంగులున్-
వేయివిధంబులన్ దలఁచి ♦ నెమ్మది మిక్కిలి శాంతిఁగందు! నా
వేయి నమస్సు లియ్యెడ ని♦వేదనసేతుఁ బరిగ్రహింపుమా! 186

మ॥ వసుధారాజ్యము లేకపోయెనని లో♦పం బొక్కఁడేకానిఁ వ
స్తుసమూహంబులు వస్త్రముల్ ధనము రా♦సుల్ రాసులై యుండు! నీ

దు సుహృద్భావముతోడ – వేనికిని నెం♦దున్ లోపముల్ లేవు! నీ
విసుమంతైనను జింత నొందవలదో ♦ యిందీవరాభేక్షణా! 187

ఉ॥ నీనిబిడాదరంబును గ♦ణింతును నేఁబదివేలమాఱు! లెం
డైనను నీ విశాలజగ♦మందున నాకు శుభంబుఁ గోరఁగాఁ
బూనినదాన వొక్కతెవు ♦ వొల్లు వటంచును గంపెడాస య
జ్ఞానన! జీవితంబున క♦నంతసుఖోన్నతిఁ గూర్పఁజాలెదున్! 188

మ॥ త్వరమై మార్పులు నాపరిస్థితుల రా♦వచ్చున్! మహీరాజ్యమున్
వఱలన్ వచ్చును! నన్నుఁజేరఁగల సం♦పత్తున్ బలంబున్ భవ
త్పరమున్ జేయుచు నీమహోన్నతికి య♦త్నంబూని సత్కీర్తినిన్
బెరుఁగన్ జేసెద! నింద్రభోగము సుమీ! ♦ నిన్గొల్చుటల్ మానినీ! 189

మ॥ చతురంభోధిపరీతవిస్తృతమహా ♦ క్ష్మాసీమ నీప్రాణి నా
కతిమోదంబు ఘటించు – నీమె కొఱకై ♦ ప్రాణంబుతోనుందు నన్
స్థితి లేకుండెను! నేఁడు నీకతమునన్ ♦ సిద్ధించెఁ బుణ్యాంబు! జీ
వితముత్సాహముతోడఁ దీర్తు జగముల్ ♦ బ్రీతిన్ బ్రశంసింపఁగన్ 190

ఉ॥ త్రోవయుఁ దెన్నులేని విధి ♦ త్రోపులఁజేడ్పడి కుందుచుంటి! నా
దేవుఁడె నన్ను నీకడకుఁ ♦ దెచ్చె! మహాగుణవార్ధివౌ జగ
త్పావని వౌదు! విర్వురకుఁ ♦ బర్విన మైత్రియు నిన్ననేఁటిదే!
భావము నొవ్వ దేని యొక ♦ ప్రార్థన మున్నది! యాలకింపుమీ! 191

చ॥ త్వరపడుచుంటినో! వ్యవధి ♦ తక్కువో! లేక పరస్పరంబునో
యెఱుక బలంబుచాలనిదో! ♦ యే నిసుమంత యెఱుంగ! దైవవి
స్ఫురణము ముందుద్రోసెడిని ♦ పూర్ణసుధాంశునిభాస్య! తప్పుగా
నరయవటంచు నమ్మి హృద ♦ యం బెటులో యిట విప్పిచెప్పెదన్! 192

క॥ నీవిపుడు భేద మెఱుఁగని
భావముతో మెలఁగ నటులె ♦ వర్తించుటయున్
నావిధియని కొంచెము ధై
ర్యావిష్కృతిఁగంటిఁ జెలి! కృ♦పాప్తిన్ గనుమీ! 193

సీ॥ అనురాగదృష్టి న ♦ న్నాదరించితివి! నీ
హృదయ మారాధింప ♦ నిచ్చినావు!
దీనికిఁదోడు నీ ♦ దివ్యకల్యాణ జా
గ్రన్మహోరుచిరవి ♦ గ్రహము నాదు

నింటఁ బ్రతిష్ఠించి ♦ యెపుడు నాసామ్మని
క్షణమైనఁ బాయక ♦ కరముభక్తి
నెదుర మోకారించి ♦ హృదయార్పణ మొనర్చి
మామకహృదయ సా ♦ మ్రాజ్యలక్ష్మి

గీ॥ మూర్తిఁగొనినట్టి మత్పూర్వ ♦ పుణ్యఫలము
తనువుధరియించు దివ్యసౌం ♦ దర్యధనము
గా మదినిగొల్చి సంతృప్తిఁ ♦ గనఁగలిగిన
వనిత! నామహాభాగ్య మే ♦ మనఁగవచ్చు! 194

మ॥ సతి! యాత్మార్పణఁజేసి కొల్వ నవకా ♦ శంబిచ్చి గాఢాంధకా
రతతిన్ మున్గుచు నాస లూఱటలు దూ ♦ రమ్మైన మత్పూర్ణజీ
వితమున్ నూత్నమహాకళాభ్యుదయసం ♦ స్ఫీతంబు గావింపుమీ
ప్రతికూలాచరణంబులేక యనుచున్ ♦ బ్రార్థింతు మున్మాటికిన్!" 195

మ॥ అని – వాసంత జయంత మన్మథ మనో ♦ జ్ఞాకారరేఖావిసూ
తనశృంగారముఁగొల్పు దేహముఁ బద ♦ ద్వంద్వంబు సామీప్యమం
దున వాల్చెన్! సతి "శ్రీహరీ! యిదియు నెం ♦ దున్ గల్గునే! లెమ్ము లె"
మ్మని దోర్యుగ్మముఁబట్టి లేపె! నతనిన్ ♦ హర్యక్షశౌర్యోజ్జ్వలున్! 196

క॥ వనితయు బుజ మంటుచు లే
పినను గగుర్పాటునొంది ♦ వీరుఁ డపుడు నూ
తన తేజస్థగితుండై
తనరెన్ బుష్పావతీని ♦ తంబిని గనుచున్! 197

మ॥ "నినుబాధింపఁగఁ గోర్కి లేదు! కరమున్ ♦ నిర్బంధమున్జేసి నీ
మనసున్ మార్పను! నాదు తీవ్రతకునై ♦ మన్నించి పీలా విడం
బనమున్గైకొని యోజనన్ సలిపి నీ ♦ భావానుకూల్యంబు నా
కు నెఱింగింపుము! నీదువాక్యముల నా ♦ కున్ నమ్మకం బుండెడున్! 198

క॥ జీవితమంతయు నీదగు
పావనసేవనలఁ గడుప ♦ వలసిన నేనే
త్రోవ విడిచి నినుగలఁచిన
మేవడిమెయిఁ గంచె చేను ♦ మేయుట గాదే! 199

గీ॥ అంబరముపైన వ్రాలిన ♦ నభ్రులేదు
పొంగివచ్చిన భూదేవి ♦ క్రుంగిచనిన

నాకుఁ గొఱప్రాణములును గం ♦ ఠమున నున్నఁ
ప్రియతమా! నీదు తలపూవు ♦ ప్రిదులనీను!'' 200

క॥ అని వీఱుఁడనఁగ నెలఁతుక
తననిడువాల్చూపు లపుడు ♦ ధరవాల్చుచు వీ
రునిహృదయమును గ్రహించుచుఁ
దనమది యోజించి యోర్పు ♦ దనర-నతనితో! 201

"నలినీరంజను విషయముఁగూర్చి పుష్పావతి యోజింతుననుట"

ఉ॥ నీనుడు లాలకించితిని! ♦ నీహృదయస్థిత భావవైఖరుల్
నేనుగ్రహింపఁగల్గితిని! ♦ నీయెడ నే నిసుమంత భేదముల్
గానను! నీవు పల్కినది ♦ నైజమ యౌఁగద! దోస మున్న దే!
యైనను స్థైర్యమూని విష ♦ యంబును దేల్చుట యొప్పు డొప్పగున్! 202

మ॥ అనుఁగుందల్లిని బాసినట్టి యొకక♦న్యన్! ప్రాయమా-స్వల్పమా
టను లోకానుభవంబుచాల! దెదురా ♦ డన్ రానివాఁ డల్లనా
జనకుం! డాతని కేకపుత్రికను! నీ ♦ సందర్భముల్ మంతనం
బున యోజింపక యెట్టు లిట్టి విషయం ♦ బున్ నిర్ణయింపన్ దగున్! 203

క॥ నిరతంబు దండ్రిమఱుఁగునఁ
దిరుగవలయుదాన నగుటఁ ♦ దెలియుము! 'కన్యా
పరతంత్రా!' యనుటయు నీ
యెఱుఁగని ధర్మంబొకో!య ♦ హీనవిచార్థా! 204

శా॥ ఏమీ తొందర! యుందు వీ విచట! నే♦నిందుందుఁ! బల్మాఱు రా
మా! మాటాడుకొనంగఁబోమ! మది ని ♦ ర్మగ్నంబులౌ కోర్కె లెం
తో మోదంబునఁ జర్చచేసికొనమా! ♦ తోషంబునున్ బొందమా!
యేమో దైవము ప్రాతికూల్యముల ని ♦ ష్లే పెంచునా యెప్పుడున్! 205

చ॥ ఇనుఁ డపరాంబురాశిఁ బడ ♦ నేగెడి! నెప్పుడు వత్తునంచు నా
జనకుఁడు వేచియుండు! నిఁక ♦ జాగొనరింపఁగ రాదు నాకు! నీ
కును బస భోజనంబు లొన ♦ గూడుఁగదా యనువైనభంగి గా''
నన-నలవీరుఁ''డన్నియు సు ♦ ఖాస్పదమై సమకూరి యుండెడున్! 206

ఉ॥ ఆటలఁ బాటలన్ జలవి ♦ హారములన్ దమిగల్గు నాకు! న
ల్లాటఁ గలమ్మునొండు సము♦పార్జనచేసి తటాకమందు స

య్యాటల నాడుచుందు! నపు ♦ డప్పుడు చంద్రమహల్ పిఱుంద బా
హాటముగాఁ జరింతు భవ ♦ దంచిత దర్శన మందు నాసతో! 207

చ॥ స్థిరముగనుండ వాపదలు! ♦ శీఘ్రమ నాదు నదృష్టలక్ష్మి సుం
దరదరహాసవీక్షణము ♦ నాపయిఁ గొల్పఁగవచ్చు! నంత కి
ద్వారము రహస్సమాగమ ని ♦ రూఢి మెలంగుద! మేరితోడ న
న్గుఱించి వచింపఁబోకు! మిఁక ♦ గోప్యతపట్టు మొకింత కాలమున్! 208

క॥ జనకుఁడు నీవే లోకం
బని మెలఁగెడు! నతనిచెంత ♦ నైనను ననుఁగూ
ర్చినమాట పుట్టకుండుట
చను! సమయము రాగ నన్ని ♦ సమకురు నతివా! 209

క॥ నీమామ కుటుంబమునెడ
నీమదిఁగలభక్తిరతి గ ♦ ణించితి! నీ రీ
వా మహిరాజ్యం బతనికి
శ్రీమీఱఁగ సంక్రమింపఁ ♦ జేయఁ గడఁగుదున్!" 210

మ॥ అని యబ్జాక్షిముఖంబుచెంగట నిజా ♦ స్యంబుంచి పల్కఁగ నా
వనితారత్నము "నేను మానినియతిన్ ♦ బాటింతు! నాపైన దే
వునివాత్సల్యము గల్గినప్పుడె సుఖం ♦ బుల్ మంగళంబుల్ దన
ర్చును! లోకేశుఁడు సర్వశక్తియుతుఁడం ♦ చున్ నమ్మియుందున్ సదా! 211

క॥ నామామగారి రాజ్యం
బామహనీయునకుఁ జేరు ♦ నటుచేయఁగ నీ
వీమెయి నూనిన శపథం
బేమఱఁగాఁబోకు! నిన్ను ♦ నీశుఁడు బ్రోచున్!" 212

క॥ అని యాకసమ్ము వంకకుఁ
దనచూపెగనెత్తి నిలుచు ♦ తరళేక్షణ మో
హనహస్తముఁ దనకరమునఁ
గొని వీరుఁగు కనుల నద్దు ♦ కొని వెడలిచనెన్! 213

చ॥ పడతి వనంబులోని సుమ ♦ వారముఁగోసి యొకింత శీఘ్రపు
న్నడల వనంబుదాటి సద ♦ నమ్మునుజేరఁగఁబోయి తండ్రివెం
బడిఁజని యోగిరంబుగొని ♦ వైళమ మేడను గమ్మపూలు సొం
పడరెడు సెజ్జ యెక్కి మధు ♦ రామృతపుం గల లావహింపఁగన్! 214

ప్రథమాశ్వాసము

---

శ్రీ

# పుష్పావతి

## ద్వితీయాశ్వాసము



మ॥ పలుమాఱున్ మది నావరించెడు సుఖ ♦ స్వప్నంబులన్ నర్మభా
షల సాగించుచుఁ బ్రొద్దుపుచ్చుచు రహ ♦ స్యప్రక్రియారూఢులై
నలినీరంజనుఁడున్–లతాంగియును నా ♦ నందంబుతోడన్ దినం
బులనున్ ద్రోయుచునుండి రీశ్వరు కృపా ♦ పూరంబుఁ గాంక్షించుచున్ ! 1

మ॥ ఒకసాయంతనవేళ నెప్పటి మనో ♦ జ్ఞోద్యానభాగంబు చెం
తకుఁ బుష్పావతి – మబ్బుఁజొచ్చెడు తటి ♦ త్సౌందర్య తేజంబుతో
నొకచోఁ జేరి మనఃప్రియాగమ సమ ♦ గ్రోత్సాహయై యుండ ను
త్సుకుఁడై వీరుడు పద్మనేత్రకడ క ♦ చ్చో వచ్చి నిల్వంబడెన్ ! 2

గీ॥ కన్నులనె మ్రొక్కి–క్షేమసం ♦ గతులనడిగి–
మగువ పుష్పావతీదేవి ♦ మందహాస
పరమశోభలు వెలయ ని ♦ వాళిమెత్తె !
వీరుఁడు (మనంబుగఱఁగి) య ♦ వ్వాలది డాసి, 3

"నలినీరంజను సంప్రార్థనము"

మ॥ "నెలలా – రెండును మూఁడునున్ గడచనెన్ ! ♦ నేనింత కాలంబుగా
నెలఁతా ! కొల్చుచునుంటిఁ బ్రీతిమెయి ! నీ ♦ నిర్దిష్టమాభావ మీ
లలియం చించు కెఱుంగఁజాలమికినై ♦ లజ్జింతు ! నాలస్యమున్
సలుపన్ బోవక యేదియేనిగతి నా ♦ జ్ఞాపించి మన్నింపుమీ ! 4

మ॥ రమణీ ! పల్మరు తొందరించి సుకుమా ♦ రంబైన నీదివ్యచి
త్తము నొప్పింతు నటంచు నెంచకుము ! నా ♦ తాత్పర్యమెప్డున్ భవ
త్ప్రీమదవ్యాప్తిని గోరు ! భేద మణుమా ♦ త్రం బుండఁబో ! దైనఁ గా
లమునున్ గుజ్జపుఁబర్వతోడ నెపుడున్ ♦ లంఘించుచుండున్ గదా ! 5

చ॥ అనుకొనరాని యాసలకు ♦ నగ్గలమై ప్రతికూలకాలవా
హిని కెదురీఁత లీఁది యిపు ♦ డెంతయు డస్సితి ! సుంతలాభముల్
గనఁబడకే వృథాశ్రమము ♦ గాఁ దుదముట్టునొ ! కట్ట ! కాలపుం
దనుజున కేటి జాలి ! యువ ♦ తండము గుండెలు బెండుసేయఁడే ! 6

చ॥ అరవిరియంపకాఁడు హృద ♦ యాబ్జము గాఁడ శరంబుఁ గ్రుచ్చె! నీ
కరుణయు నాకుఁ గల్గునొకొ ♦ కల్గదొ తేలదు! నా ప్రయత్నముల్
పరగునొ నీటిబుగ్గలయి! ♦ పాలను ముంచెదొ నీట ముంచెదో!
త్వర నెఱిఁగించి నాహృదయ ♦ తాపము వాపు కృపాపరాత్మవై! 7

ఉ॥ నీరజపత్రనేత్ర! విను ♦ నీరమణీయ మహాప్రసన్న శృం
గారవిలాసవిగ్రహము ♦ గాటముగా మదినాటి – రేలు ని
ద్రారహితంబులై చనక ♦ తప్పదు! నీకృపఁగోరి కోరి వే
సారితి! నిప్పుడైన మది ♦ సమ్మతిఁ జూపి సమాదరింపుమీ? 8

చ॥ సుమహితరూప! నీనడచు ♦ క్షోణి పవిత్రమటంచు నెంచి పా
దములను మోపి నేనడువఁ ♦ దద్దయు జంకెద! నాదుపాలిదై
వమవని యెంచుచుందును! భ ♦ వన్నవమోహనవిగ్రహంబుఁ జి
త్తమునను నిల్పి భక్తివిత ♦ తంబుగఁ బూజ యొనర్చుచుందుదున్! 9

క॥ ఉత్తమకాంతలయెడఁగల
యుత్తమ గుణగణములెల్ల ♦ నొకటయి నీయం
దొత్తగిలియుంటఁ జిత్తము
హత్తుకొనియెఁ! దొలఁగఁద్రోయ ♦ నలవియె యిపుడున్! 10

సీ॥ లలన! నీకడఁగొన్న ♦ వలపుఁబూమాలఁ దా
ల్పఁగలేను! బూని త్రెం ♦ పంగలేను!
చిత్తమ్ముహత్తు నీ ♦ శ్రీమూర్తి స్థిరముఁ గా
వింపలే! నటుత్రోసి ♦ వేయలేను!
రేల నిద్దురను దా ♦ ల్లెడు సుఖస్వప్నాల
నలఁగలే! నవల గెం ♦ టంగలేను!
నెలఁత! నీవర్పించు ♦ నీరాజనము లాద
రింపలేను! బరిహ ♦ రింపలేను!

గీ॥ నుండఁగాలేను! వెండి లే ♦ కుండలేను!
యెప్పుడెటులౌనొ యనువెత ♦ లుప్పతిల్లి
కలఁత యంతంత కెక్కుడై ♦ నిలిచిపోతిఁ
బ్రళయవాతంబు నడిమి దీ ♦ పంబు మాడ్కి! 11

" పుష్పావతి యంగీకారము "

క॥ అడుగఁగలే కడిగితి! నా
నుడుల కడల వలదు! కృపఁగ ♦ నుంగొని నీవి

ప్రోడఁబాఱు దెలిసి యీఱట
నోడఁగూర్చు ''మటన్నఁ జెలువ ♦ యున్ హర్షమునన్, 12

ఉ॥ “నిక్కము నీవు పల్కితివి! ♦ నేనెటు కాదని చెప్పనేర్తు! నీ
పెక్కుదినంబులున్ గలఁత ♦ నెంచెడు నీవిషయంబులోని పె
న్జిక్కులనెల్ల నేఁదఱచి ♦ చేసితి నిర్ణయ మొక్కభంగి! నీ
కొక్కశ్రమంబు గల్గదని ♦ యీఱట నొందుము! చింతఁబాయుమీ! 13

మ॥ నళినిరంజన! నీదు సౌఖ్యమునకై ♦ నాజీవితంబెల్ల ని
శ్చలవిశ్వాసముతోడ నిమ్ముదుపదా ♦ బ్జద్వంద్వమున్ భక్తితో
గొలువన్ నిర్ణయమున్ బొనర్చితిని! నా ♦ కున్ భర్తనై యెప్డు రం
జిలఁగాఁజేయుము! దేవదేవుని శుభా ♦ శీర్వాదముల్ గల్గెడున్! 14

సీ॥ వలపుమైఁగఱఁగి నే ♦ పైన నాసలునిల్పి
నమ్మిన నాదు చం ♦ దంబుఁదలఁచి!
రెన్నెలైయైన ధా ♦ త్రినిబుట్టుటాదిఁ బ్రే
మించినట్లు మెలంగు ♦ మేలుఁదలఁచి!
తల్లిగారాముచె ♦ ద్దయము తెఱుంగక పెర
వారు పెంచిన కష్ట ♦ పరతఁదలఁచి!
సడి సన్నలేక ని ♦ ష్కలుషమై మిగుల శ్రే
ష్ఠంబగు నాదు శీ ♦ లంబుఁదలఁచి!

గీ॥ పరమ ధర్మవర్తనుఁడైన ♦ భర్త తనదు
ప్రాణసతి నెట్టులేలు–నా ♦ పగిది నేలు!
తృప్తినొందెదఁ! గాని కో ♦ రికలు కోరి
మనసుఁగలఁపంగ నాకభి ♦ మతముగాదు! 15

క॥ మామామకు రాఁదగు రీ
వా మహీరాజ్యంబుఁగూర్చి ♦ పట్టిన శపథం
బీమెయిఁ దరుమఁ దలఁప! నీ
పై మది నభిమాన మూని ♦ భావజమూర్తీ! 16

క॥ అది మొదలంటఁగ వదలఁగ
మది సొగయదు! పిదపనైన ♦ మంచిప్రయత్నం
బొదవ నడిపి మామామకు
ముదము ఘటించుటయు నీకు ♦ ముఖ్యవిధి యగున్! 17

ఉ॥ నాదెస నీకుఁ గల్గిన ఘ ♦ నంబగు ప్రేమభరంబు – దొడ్డ మ
ర్యాద – పవిత్రభావము – స ♦ మాదర వృత్తియుఁ – జిత్తశుద్ధి – యా
హ్లాదముఁ గూర్చె! నేకొఱత ♦ నైనను గల్గదు! నీవు రూఢిగా
నాదగు దైవతంబవని ♦ నమ్మి చరించెదఁ జిత్తశుద్ధితో! 18

మ॥ కులకన్యోచిత శీలపోషణము నా ♦ కున్ బ్రీతియౌఁ గావునన్
దెలుపన్ భావ్యము నాదుతండ్రి! కతఁడున్ ♦ డెందంబునన్ సమ్మతిన్
గొలుపన్ గల్గునొ! లేదొ! యూర కిపు డీ ♦ కోలాహలం బేటికిన్
సలుపంగావలె నంచు నాతనిదెసన్ ♦ మానంబుఁ బాటించితిన్! 19

గీ॥ జనకుఁ డనుమతించినను బ్ర ♦ శస్త! మట్లు
కాక – వలదనె నేనియు ♦ గాలికేగు
తలపుఁ బైనైచుకొనుటయుఁ – ♦ దప్పి నీ చ
రిత్రఁ దెలుపుట – తప్పులు ♦ రెండు గలుగు. 20

మ॥ జలమున్ దిండిని సంతరించుచుఁ గృపా ♦ సారళ్య మేపారఁగా
శిలలోఁ బుట్టిన కప్పఁ బెంచుచు జగ ♦ త్క్షేమంబు సంధింపఁగాఁ
గల సర్వేశుఁడు నిన్ను–నన్ను మఱవం ♦ గాఁబోఁడు! విశ్వాసమున్
గలదా దేవునియందు నాకుఁ! గొఱ గ ♦ ల్గన్ బోదు విశ్వాసికిన్! 21

చ॥ ఉసిరికకాయతో నుదధి ♦ యుప్పను గూర్చి సమృద్ధిగా రసం
బెసఁగఁగఁజేయు బ్రహ్మవలె ♦ నే–విని కానని వారిఁగూర్చి రా
గసరణిఁ జొక్కఁజేయుచు సు ♦ ఖమ్ము శుభమ్ము లొసంగ నేర్చు నా
ప్రసవశరుండె నేఁడు మన ♦ ప్రాపయి సర్వము నిర్వహించుతన్! 22

ఉ॥ దేవునిపాదయుగ్మము మ ♦ దిన్ స్మరియింతము! శీఘ్రకాలమం
దే వెలయున్ శుభంబు! భవ ♦ దీయమహోన్నతిఁ గోరుచుండెడిన్
భావ''మటంచుఁ బల్కి సద ♦ నంబునకున్ జననెంచి యప్డు పు
ష్పావతి వీరునిన్ సెల వొ ♦ సంగఁగఁ గోరిన నాతఁ డర్మిలిన్! 23

మ॥ ''నవనీతమ్మునకన్నఁ గోమలము స్వాం ♦ తం! బంతకున్ గోమలం
బవు సద్వర్తన! మంతకన్న మృదులం ♦ బౌ ప్రేమరాగోదయం!
బవురా! నీవలె నుత్తమోత్తమ గుణా ♦ ఢ్యుల్ గల్గుటన్ గాదె యీ
భువి రాణించు దివంబుమాడ్కిని సుఖం ♦ బున్ శ్రాంతి సంధించుచున్. 24

మ॥ యువతీ! నీపరమోత్తమత్వము మదిన్ ♦ యోజింపఁగా–దేవదూ
తవు నాపాలికి! నెల్లవేళలను మ ♦ త్ప్రాణంబునున్ మించి ప్రే

మవిశేషంబునఁ గొల్చువాఁడ! నిది సం ♦ బద్ధంబు గాకున్నచో
లవమేనిన్ మనఁగోరఁబోవను జుమీ! ♦ లావణ్య రత్నాకరా! 25

సీ॥ ఏనోము ఫలమొకో ♦ యిన్నాళ్లనుండి వీ
క్షించి వీక్షించి కాం ♦ క్షించుచుంటి!
నో సఖి! యెన్నాళ్ల ♦ కో సెలవుగ నీదు
చిత్తంబు నేఁడు రం ♦ జిల్లఁగంటి!
నేపుణ్యపాకమో ♦ యీప్రొద్దు సుదినంబు!
చిరమనోరథ ఫల ♦ సిద్ధియొదవె!
నీలోకమందు నన్ ♦ బోలిన పుణ్యావం
తుఁడు గానరాఁ డెట్టి ♦ యెడ వెదకినఁ!

గీ॥ బుట్టుటాదిగఁ గష్టత ♦ మో నిమగ్న
మైన మజ్జీవితాకాశ ♦ మందుఁ గనులు
మెఱయ మిఱుమిట్లుగొను దొడ్డ ♦ మెఱుపు మెఱసెఁ!
దృష్టిఁ గనఁగంటి! సిరులు వ ♦ ర్ధిల్లఁగంటి! 26

క॥ తరలాక్షి! ప్రతాపమహీ
శ్వరురాజ్యము గడనసేయఁ ♦ బ్రాణంబులు నే
సరకుగొనక యత్నించెదఁ!
బరమేశ్వరుసాక్షి! నాదు ♦ ప్రతినను దీర్తున్!" 27

చ॥ అని - నలినంబువోలె మృదు ♦ వౌ చెలి కేల్గొని ముద్దు వెట్టె! నం
గన యనురాగమంజురస ♦ గాఢవిలోకనముల్ నిగుడ్చి యా
జ్ఞనుగొని వెళ్లసాఁగె! నల ♦ చాన పదమ్ముల చల్వనీడలన్
గనుగవ నద్ది వీరుఁడు సు ♦ ఖమ్మున నేగె గృహంబుఁజేరఁగన్! 28

ఉ॥ ఆలయమైన చంద్రమహ ♦ లందు దినోదయవేళలోఁ-జతు
శ్శాల కురంగటన్ - గది - వి ♦ శాలమనోజ్ఞ గవాక్షసీమలో-
బాల - సరస్తరంగతతి ♦ పైఁబరతెంచెడు మందశైత్యపుం
గాలికిఁ-గూరుచుండె నవ ♦ కంజములున్ వికసింపఁ-జూచుచున్! 29

క॥ కమలేక్షణ సౌధగవా
క్షమున నిలుచు రామణీయ ♦ కముఁ గన్గొనఁ జ
ట్టము నలమి రచించెడు చి
త్రమొకో యన నేత్రపేయ♦తన్ సంధించెన్! 30

మ॥ అలినీలోత్పలరాజిఁబోలు నుదుపం ♦ బాపద్మకాసార ని
ర్మలతోయంబులఁజేల్చుకొంచు నదుదే ♦ రన్ జూడ్కి-సారించి యా
నలినీరంజను నానయంచు ముదమం ♦ దన్ - విల్లుమోపెట్టి పూ
ములకుల్ గుప్పె మరుండు బాలహృదయం ♦ బున్ జిలి చిల్లుల్ వడన్! 31

మ॥ నలినీరంజను లోకమోహన శుభా ♦ నంద ప్రదాకార రే
ఖలు - నవ్యాని హృదేకరంజక కళా ♦ కౌశల్యముల్ - వాని స
ల్లలితాలాపనిరూఢి జ్ఞప్తియయి యు ♦ ల్లంబున్ గఱంపంగ - నా
తలఁపున్మొత్తములో మునింగెను నితాం ♦ తధ్యాన పారీణయై! 32

చ॥ నెలఁతుక యట్టు లెంతవడి ♦ నిల్చెనో! వీర నృసింహరాయ రా
త్రిలకుఁడు మేడయెక్కి చను ♦ దెంచుటగాని - ప్రపంచమంతటన్
మిలమిల నెండలున్ గవియు ♦ మేవడిగాని - యెఱుంగకుండ ని
శ్చలముగ నిల్చియుండె-నొక ♦ స్వర్ణమనోహర విగ్రహంబటుల్! 33

క॥ నరసింహరాయఁ డచ్చటఁ
గొరలెదు నొకయాసనమునఁ ♦ గూర్చుండి సుతన్
దరియఁగరమ్మని పిలిచినఁ
దరుణి తిరిగిచూచి వచ్చి ♦ తగఁ గూర్చుండెన్! 34

"నరసింహరావు పూర్వచరిత్రము"

క॥ "నానోముల ఫలమా! పు
ష్పా! నేఁడిట బ్రహ్మలోక ♦ పర్యంతము చిం
తానిరతి నుంటి! విచటికి
నేనరుదెంచుటయుఁ దెలియ ♦ వింతటిదాఁకన్! 35

శా॥ నీ కష్టాదశవర్షముల్ దరిసె! త ♦ న్వీ! యొక్కమాటేనియున్
సాకల్యమ్ముగ నేను నాస్థితిగతుల్ ♦ సంసారమున్ గూర్చియున్
నీకున్ దెల్పఁగనైతిఁ! గాల మిటులే ♦ నిర్లిప్తమై సాఁగెడిన్!
నాకేం డ్లర్వది దాఁటుచుండె! నిపుడై ♦ నన్ దెల్పు టొప్పున్ గదా! 36

ఉ॥ నీదగు మేనమామ గణ ♦ నీయుఁడు తొల్లి ప్రతాపసింహుఁడున్
నాదగు తల్లిపార్శ్వమున ♦ నర్మిలిచుట్టము! బాల్యమందె త
త్సోదరి నీదుతల్లిని 'వ ♦ సుంధర' నాకిడి పెండ్లిచేసి యా
హ్లాదముతోడ సాయమయి ♦ యారయుచుండె సహస్రరీతులన్! 37

శా॥ కాలాగ్నిప్రతిమాన తేజుఁడని లో ♦ కంబెప్డు గీర్తించు - నా
'ఆలా'సైన్యవిభుండు చంద్రమహా ల ♦ త్యంత ప్రతాపాంచితుం

క్తై లగ్గఁగొని యొక్కమాసమునకున్ ♦ స్వాధీనతన్ బొందెఁ! దా
నాలంబున్ విడి యాప్రతాపుఁడు గృహ ♦ త్యాగంబుఁ జేసెన్ వడిన్ 38

ఉ॥ నారి వసుంధరారమణి ♦ నాల్గవమాసము నిండి - గర్భపుం
భారముతోడ - సోదరుని ♦ బాయు విషాదపుభార - మెంతయున్
గ్రూరదురంతరీతి వెతఁ ♦ గూర్పఁగ - నాసతి పడ్డపాటు లా
శ్రీరఘురాముఁడే యెఱుఁగుఁ ♦ జెప్పఁగనేర్తురె మర్త్యమాత్రులున్ ! 39

మ॥ మనకున్ దొల్లిటినుండి యేలుకొనఁగా ♦ ఝార్ఖండమున్ లేమి జీ
వనసౌకర్యము చాలకుండెను! ప్రతా ♦ పస్వామి సాహాయ్యవ
ర్తనఁ గాలంబెటొ సాగెఁ! గష్టములకున్ ♦ దావెందు లేకుండె! నా
యన రాజ్యచ్యుతి నీటఁబాసి చను మ ♦ త్స్యంబట్లు డీల్పోయితిన్ ! 40

గీ॥ 'సుకములా - యుగమున కొక్క ♦ డొకఁడు వచ్చు!
నాపదలు నిమేషమునఁ గో ♦ ట్లగుచు దూఁకు'
ననెడు సామెత సార్థకం ♦ బై తనర్చెఁ
దనయ! నాదెస మాబావ ♦ తలఁగిచనిన! 41

గీ॥ వ్యాధు లీతిబాధలు కరువు ♦ పైరులేమి
యివి యవననేల లోకమం ♦ దెన్నిగలుగు
నన్నిపీడ లొక్కటిగ న ♦ న్నలముకొనియెఁ!
దలఁచినంతనె యొడలెల్ల ♦ జలదరించు! 42

గీ॥ పదవమాసంబు నిండి గ ♦ ర్భంబు పండి
పసపుగంపనుబోలు నా ♦ పద్మముఖి వ
సుంధరాదేవి కడకొక్క ♦ శుభ దినమున
నేఁడు నన్నుద్ధరించు నీ ♦ నిన్నుఁ గనియె! 43

ఉ॥ నిన్ననుగాంచి మోదమును ♦ నించెనొ లేదొ! పదేనునాళ్లకే
యన్నలమిన్న జబ్బువడె! ♦ నాదటఁ నేమన! నాదుపూర్వపుం
బున్నెము సన్నగిల్లెనన! ♦ బూజ్యగుణంబుల కాణయాచి నా
కన్నులనిద్దపువ్వెలుఁగు ♦ కట్ట! దివంగతయయ్యె నయ్యెడన్ ! 44

క॥ నాపూర్వజన్మపుణ్యము-
నాపాలిటిభాగ్యలక్ష్మి ♦ నను వీడఁగఁ బె
ల్లాపదలపైన నాపద
లాపాదిలి క్రుంగిపోయి ♦ యడుగునఁ బడితిన్ ! 45

ఉ॥ పేదనకైన నొక్కజల ♦ బిందువు కన్పడకుండ నెల్ల కా
సారము లింకిపోయినవి! ♦ క్షామము లోకము నావరించె! నా
హారము నీరులేక జగ ♦ మంతయుఁ బీనుఁగుఁబెంటయయ్యెఁ! గో
పారణ మృత్యుదేవత వి ♦ హారమొనర్చెను దేశ మంతటన్! 46

మ॥ అమితప్రీతిఁ బ్రతాపరాయఁడు పవి ♦ త్రాత్ముండు లోలోన సా
యముఁ గావించుచునున్నఁగూడ — వఱపుల్ ♦ వ్యాధుల్ వ్యయంబుల్ దురం
తములై రేఁగుటఁజేసి జీవికనిమి ♦ త్తం బప్పులన్ జేసి గో
క్కముల్ దెచ్చితి వేలు లక్షలును! వ ♦ క్కాణింపఁగా నేటికిన్! 47

మ॥ పడపింతేనియులేని యప్పుడు మహా ♦ బానేతయా పూర్ణమ
ల్లుఁడు నన్నున్ బిలిపించి ప్రీతిమెయి నా ♦ లోకించి "రీవాక్షితీ
శుఁడవై రాజ్యమునేలుమీ!" యనుచు ని ♦ చ్చో నన్ నియోగించె! న
య్యెడఁగావించిన యుత్సవమ్ములకు నె ♦ న్నెన్నేలు పట్టెన్ జుమీ! 48

గీ॥ మంత్రులును — సైన్యనాథులు ♦ మాటబలిమి
యలరు నుద్యోగు లరుదెంచి ♦ నపుడు తగిన
గారవముచేయకున్న — జ ♦ గంబు పరిహ
సించునని విత్తము వ్యయంబు ♦ చేయవలసె! 49

క॥ పిలిచిన 'నో'యనియెడు వా
రల యందఱనొద్ద నప్పు ♦ గ్రహియించితి నేఁ!
గోలఁదికి మీఱుచుఁ బెఱిగెను!
బలుకదె జనకోటి 'ఋణము ♦ పరుగిడు'ననుచున్! 50

శా॥ పౌరుల్ గూడి 'నృసింహరాయఁడె మహా ♦ బా భూవిభున్ రేఁపి తా
నీ రీవాక్షితి నాక్రమించునటు దం ♦ డెత్తించినాఁ' డంచుఁ దా
మారాటంబులు వ్రెళ్లఁగ్రక్కి! రది స ♦ త్యంబౌనె! మాబావయున్
వేఱున్ — నేనును వేఱె! మాకు నెపుడున్ ♦ భేదంబు వాటిల్లునే! 51

క॥ నాపాలి కల్పతరువై
ప్రాపైన ప్రతాపరాయ ♦ వసుధాపతి నే
శ్రీపరమేశ్వరసమునిగ
నేపొద్దు దలంతు ననుచు ♦ నెఱుఁగదె జగమున్! 52

ఉ॥ లోకులు కాకులన్న నుడు ♦ లున్ వినమే! మదిఁ దోఁచినట్టులన్
వాగొనుచుంద్రు! కాని యది ♦ పథ్య మపథ్యమటంచు యోజనం

చేకడనైనఁ జేయఁగల ♦ రే! యిఁక లోకము నోరుమూయఁగా
మూఁకుడు లేదటంచు బుధ ♦ పుంగవు లెప్డు వచింతురే కదా! 53

గీ॥ వార లేరీతి నాపసో ♦ పాలు పడిన
నోర్చితిని! గొంతవడి కవి ♦ యుడిగెఁ! గాని,
యప్పుమాత్రము పెరిగి కొం ♦ డంత యయ్యె!
దీర్పని ఋణంబు పెరుగదే ♦ దివినిసోఁక! 54

మ॥ పలుసంసారపు వెచ్చముల్ మఱిమహో ♦ బా ఝ్మాపు నుద్యోగికో
టుల సత్కారముగూర్చి చెల్లువడుచుం ♦ డున్! గాని యేదుర్వ్యయం
బుల వీసం బరవీసమేని ధనమున్ ♦ బోకార్పఁగాలేదు! నా
తలవ్రా లప్పులపోఁతు గావలెనన్ ♦ దప్పింప నే నెవ్వఁడున్! 55

గీ॥ నొవ్వనాడెడు నుత్తమ ♦ ర్ణులకు నొగ్గి
తెలుపుకొనలేక–ఋణములు ♦ దీర్పలేక–
కడకుఁ జచ్చినచావు గా ♦ కయు–బ్రదికిన
బ్రదుకు గాకయుఁ–బ్రాణముల్ ♦ పట్టియుంటి! 56

తే॥గీ॥ కడుపునకును గూడు ♦ కంటికిఁ గునుకును–
హృదయమునకు శాంతి ♦ యొదవఁబోక,
పవలురేయుఁ గడుప ♦ వలసె! నప్పులవారి
బాధకన్న యముని ♦ బాధ లెస్స! 57

గీ॥ ఉత్తమర్ణులు మూఁగి దు ♦ ర్వృత్తములను
బలుక బదులాడు ధృతిలేక ♦ తలనువాల్చి
సిగ్గు దిగమ్రింగి చివికి శో ♦ షిల్లిపోతి!
శ్రీహరీ! యప్పుకోఁత వై ♦ రికిని వలదు! 58

గీ॥ 'ద్రవ్యమిక్కట్టు నరసింహ ♦ రాయని' కని
గుసగుసలు పుట్టి జగము గ ♦ గ్గోలువడియె!
బుద్ధిసెడి యుత్తమర్ణులు ♦ ప్రోవుగట్టి
ముట్టడించుచు–నాచుట్టు ♦ మూఁగుకొనిరి! 59

గీ॥ అమరపురవాసి ధనికజ ♦ నాగ్రగణ్యుఁ
డైన మనమోహనుని తండ్రి ♦ 'యుభయసింహుఁ'
డడ్డు పడివచ్చి నాయప్పు ♦ లన్నిదీర్ప
నధికధనమిచ్చి నాకుఁ జే ♦ యూదుకొనియె! 60

తే॥ నాఁ డతఁడు సాయపడకున్న ♦ నాదు పరువు
నిలిచియుండదు! నేనును ♦ నిలిచియుండఁ!
గాసు కమ్ముడువోయిన ♦ గారవంబు
కనకగిరి యిచ్చినను వెండి ♦ గలుగఁగలదె! 61

కం॥ కడచని నావత్సర మే
వడువుననో! యవలి యేడు ♦ వచ్చినపుడు దే
వుఁడు కనుదెఱచెను! వర్షము
పడియెను! బుష్కలముగాఁగఁ ♦ బైరులు పండెన్! 62

ఆ॥ వెఱ్ఱిపంట పండి ♦ వెలితిలేకుండఁ బా
తరలు మూల్గె ధాన్య ♦ తతులతోడ!
మూల్యములును దగ్గి ♦ పోకకుఁ బుట్టమ్మె!
నప్పు దీర్పలేక ♦ యడలువడితి! 63

ఉ॥ ఆయభయుండు నాకిడిన ♦ యప్పది వేలను దాఁటి లక్షలై
పోయె! నతండొకప్పు భయ ♦ మున్ బ్రకటించెను నన్నుఁడాయుచున్!
న్యాయ మెఱింగి యాతని భ ♦ యంబుఁ దొలంగఁగఁ జేయనెంచి, నే
నాయక ముంచితిన్ బొలము ♦ నంతయుఁ జంద్రమహల్ యుతంబుగన్! 64

తే॥ అభయసింహుఁ డున్నన్నినా ♦ హ్లాదరమున
నప్పు మాటెత్తకుండె! ని ♦ స్థతఁడు లేఁడు!
మోహనుఁడు తండ్రికిని దీసి ♦ పోక-నాదు
హృదయము నెఱింగి వర్తించె ♦ నింతవఱకు! 65

శా॥ ఏకాండంబుగ భూరియత్నముల నె ♦ న్నేఁజేసి కష్టించినన్
బైకం బక్కట! టోలిరైన మిగిలిం ♦ పన్ లేక శోషిల్లితిన్!
దాకట్టున్ విడిపించి యాస్తి యణువం ♦ తన్ జెందలేకుంటి! నా
వైకుంఠేశుఁడె దిక్కటంచుఁ గడకున్ ♦ భావించి కూర్చుండితిన్! 66

శా॥ రేలం దించుక కన్నుగూర్కిన హఠా ♦ ద్రీతిన్ 'ఋణాంబోధి నీ
వోలాడన్ బడ కి'మ్మటం చభయసిం ♦ హుం డట్టె కన్పించు! నా
కాలాభీల విశాలవిగ్రహము నా ♦ కంటన్ బడన్-జిత్తమున్
వ్రీలున్! గన్నులు మూఁతయింతపడ కా ♦ రే తెల్లవాఱున్ జుమీ! 67

మ॥ కుడువన్ బూనినఁ బోవ దొక్కమెదుకున్! ♦ గూర్కన్ గనన్ లేను! నా
యెడఁదన్ శాంతి యొసంగ దించుకయు! నె ♦ న్నే దుష్టసంకల్పముల్
పొడమున్! లేచినఁ గూరుచుండిన బలం ♦ బున్ దక్కనై-తద్దయున్
దడ యెత్తున్! మఱి ప్రాణ మే నిముసమో ♦ నన్ బాయు నట్లుండెడిన్! 68

"వివాహ ప్రశంస"

క॥ నాఁ డదరిన యీగుండియ
నేఁడును దిటవూనలేక ♦ నెగులుఁ బెంచుఁ!
వాడి సగమైతి! నేమనఁ
గూడక యలజడిని మ్రింగు ♦ కొంటిఁ! గుమారీ! 69

మ॥ ఇది యెన్నేఁడులుచెప్పినన్ దఱుగ! ది ♦ ట్లే చెల్లెఁ గాలంబు! ని
ర్వదియేండ్లయ్యె! ఋణంబుఁదీర్పగల త్రో ♦ వన్ జూచినన్ భావ్యమాఁ
గద యంచున్ బలుమాఱు మోహనుఁడు వ ♦ క్కాణించు! నాలస్యమున్
గదురన్ జేయక వానియప్పుల నొసం ♦ గన్ బోలు సౌమ్యమ్ముగన్! 70

శా॥ నావాక్చాతురివెంట సాహసము సం ♦ ధానించి యత్నించినన్
వేవేలేడులు నిల్చునే యతఁ! డెటో ♦ వేధించి బాధించు! నా
పై విత్తం బిఁకకంటె ముందుగనె తీ ♦ ర్పన్ జూచినన్ మేలుగా
దే! వేకష్టములోర్చియైన ఋణము ♦ త్తీర్ గన్న శ్రేయం బగున్! 71

మ॥ పదునేడేఁడులు వచ్చిరాని కడులేఁ ♦ బ్రాయంబు! చిత్తంబునన్
మృదువా! ముగ్ధవు! సుంత క్లేశమునకున్ ♦ మేనోర్వఁబో! ధాత్రి నొం
డెద వోతల్లిరో! నాకుటుంబ విషమా ♦ ర్తిన్ దెల్పి నొప్పింపఁగా
మదిలే! దెట్టులో కాలమున్ గడిపితిన్! ♦ మన్నింపు నామాంద్యమున్! 72

చ॥ అలఘుగుణాఢ్య! నీజనని ♦ యంతము నొందె నటంచుఁ-జుట్టునున్
గలిగిన యుత్తమస్త్రీలును ♦ గారియవెట్టి రటంచుఁ-దెల్పఁగా
గలకలలాడు చెక్కులను ♦ గాటుకకన్నుల నీరు కాల్వలై
జలజలఁ బాఱఁగంటి! నెద ♦ చాలఁగఁ గుందుఁగఁగంటి నీకిటన్! 73

మ॥ ఇవి యెన్నేని విపత్తు లుండినను నా ♦ కే యుండఁగానిమ్ము! ని
క్కువమున్ దాపఁగనేల! నీయెడల నా ♦ కున్ దీర్పఁగాఁ దగ్గ ధ
ర్మ మొకండున్నది! యేండ్లుగాఁ బ్రతిదినం ♦ బున్ బూని యత్నించినన్
లవమైనన్ బని నెగ్గుజాడఁ గనక ♦ ల్లాడంగ నయ్యెన్ సుతా! 74

మ॥ తనకున్ దోఁచిన యోజనల్ దెలిపి నా ♦ తాత్పర్య మాలించి, మె
చ్చినరీతిన్ ననుదిద్ది తీర్పఁగల నా ♦ చేఁదోడు వాఁదోడు నీ
జననీరత్నమె యున్న-నుత్సుకత దే ♦ శంబెల్ల గాలించి యో
గ్యుని దేఁగల్గుదు! నట్టి భాగ్యములు నా ♦ కున్ దూరమయ్యెన్ గదా! 75

ఉ॥ ఉపిరి మేననుండఁగనె ♦ యోగ్యుఁ బ్రసన్నమనోహరాత్మకున్
నీపతిఁజేసి కాపురము ♦ నెక్కొనఁజేయుచు నాభరంబుఁ ద్రో

ద్రోపులు బెట్టనెంచి పలు ♦ త్రోవల యత్నమొనర్చియుంటిఁ! గా
నీ–పొలివోయె నంతయు! జ ♦ నించె నిరాశయు నిస్పృహత్వమున్ ! 76

మ॥ ఋణభారంబును మోసి యించుకయు నా ♦ ర్తిన్ బొంద! మోపైన ధా
రణి భారంబు వహించి సుంతశ్రమమున్ ♦ బ్రాపింప! జృంభించు నా
రణభారంబుఁ దలంప! నీవలసి భా ♦ రం బెంతయున్ భారమై
యణఁగన్ జేయుచు నుండె! నెట్లు కృతకృ ♦ త్యత్వంబు నేఁగాంతునో!” 77

మ॥ అని యాస్యేందువు హస్తపద్మమునయం ♦ దానించి చింతించు నా
జనకున్ బాష్పపరిప్లుతాక్షియగుచున్ ♦ జంద్రాస్య వీక్షించి, “ యో
జనకా! నీదగు బాధలెల్ల విన నా ♦ స్వాంతంబు శోషిల్లె! ని
ల్పిన మే! లింక వచింపఁగా వలదు! నిన్ ♦ వేమాఱు లర్థించెదన్ ! 78

చ॥ పలుమఱు వచ్చి భేదము ల ♦ వంబునులేక మెలంగ, గాటపుం
జెలిమిని నీవు–నయ్యభయ ♦ సింహుఁడు నుంద్రని యెంతుఁ! గాని, య
ప్పులకయి వచ్చునంచు లవ ♦ మున్ దెలియన్ జుమి! యిప్పుడీరనన్
దెలిసితి! నీదు వంతల గ ♦ ణించితి! నించితి బాష్పపూరముల్ ! 79

మ॥ స్థిరభక్తిన్ నినుగొల్చు నాజననియున్ ♦ జేఁదోడువాఁదోడుగా
వఱలన్ నేర్చి యకాలమృత్యుగతయై ♦ స్వర్గంబునున్ జేరె! నె
వ్వారు నిన్నారయువార లిందు! నను–ను ♦ ద్వాహంబు గావించి యే
కరణిన్ గాల్లముఁద్రోసిపుచ్చఁగల! వే ♦ కాకిన్ సుఖం బంటునే! 80

శా॥ కోటుల్–సెప్పుము! వేలుచెప్పు! మవి నా ♦ కున్ సమ్మతంబౌనె! నేఁ
జాటున్ మాటును మాని తెల్పెద! నిమే ♦ షంబైన నిన్నొంటి ని
చ్చోటన్ వీడుచు నాదుసౌఖ్యమున కా ♦ స్ఫోటింప! నాపెండ్లి యన్
మాటన్ నీవిపు డెత్తకుండుటయె సం ♦ భావ్యంబు ముమ్మాటికిన్ ! 81

మ॥ జననం బందిననాటనుండియు మహా ♦ సౌఖ్యంబులన్ వీడుచున్
నను బ్రహ్మాండమునంతప్రేమమున నా ♦ నందంబుతోఁ బెంచి దే
వునిమర్యాదనుజూచు ని న్విడిచి నే ♦ బోవన్ వివేకం బెఱుం
గని చట్రాతినె! నామనం బెఱుఁగవే! ♦ కన్నయ్యా! యీనాఁటికిన్ ! 82

మ॥ ప్రముదం బొందఁగఁజాల నిన్విడిచినన్ ! ♦ ప్రాణేశుఁడన్ వాని భా
గ్యములన్ భోగము లొంది దూరమున సౌ ♦ ఖ్యంబందఁ గాంక్షింపఁ! గ
ష్టములన్ ముంపఁగఁగోర నిన్ను! నిటులే ♦ జన్మాంతమున్ బ్రహ్మచ
ర్యముఁ బాటించి భవత్పదాబ్జపరిచ ♦ ర్యల్ చేసి హర్షించెదన్ ! 83

చ॥ అఱువదియేండ్లు దాఁటె! సక ♦ లాంగములున్ వడకంగఁజొచ్చె! నే
దరియును దాపులేదు! ననుఁ ♦ దద్దయుఁ బ్రాణమువోలెఁ జూచుచున్
మురిసెడి నిన్నువీడి చన! ♦ మూఁడుజగంబుల రాజ్యమబ్బినన్
గరమున సోఁక! నీదు చర ♦ ణంబులు గొల్చి తరింతు నాయనా! 84

చ॥ హరిహరి! స్వార్థబుద్ధి యిసు ♦ మంతయు లేదు! భవత్కృపారస
స్ఫురణముఁ దొల్తనుండియును ♦ బుద్ధి నెఱుంగుదు! నిట్టి నిన్ను నొం
టరిగను వీడిపోవఁ జర ♦ ణంబులు వచ్చునె! కన్నతండ్రి స
చ్చరణము గొల్వనట్టి సుత ♦ చచ్చిన నేమగు-నున్న నేమగున్!” 85

మ॥ అని చిత్తమ్మున జాలిమెల్ల విశదం ♦ బై పల్కు సత్పుత్రికన్
గని యావీరనృసింహరాయవిభుఁడున్ ♦ గష్టంబుతోఁ “గూర్మినం
దన! నీపల్కులు భక్తిసంయుతము! లు ♦ ద్వాహంబునున్ సమ్మతిం
పనిచో నాశపకీర్తియౌ! ననుమతిం ♦ పన్ జూడు నావాక్యముల్! 86

చ॥ “శివశివ! ప్రాయముం బరువు ♦ చెందిన పుత్రిక యింటనుండఁగా
లవమును బెండ్లిమాటను ద ♦ లంపఁ డితం”డని లోకులాడఁగా
సవసవగా వినంబడి భృ ♦ శంబగు చింత వహింతు! నింక మా
న విధివహించి ధాత్రిని మ ♦ నన్ వశమే తలయెత్తి నల్వురన్! 87

ఉ॥ గీటునఁబుచ్చి నాదుమది ♦ కిన్ వెతఁగూర్పక నేవచించు నీ
మాటను బాటిసేయు! మిదె ♦ మౌర్ఖ్యము నూనకు! నీకు భద్రముల్
కోటి రహించు! నాకు నొక ♦ కూడనిమాటయు రాదు! నీవిఁకన్
గోటులుఁగోట్లు చెప్పినను ♦ గొబ్బునఁ బెండిలి సేయఁగావలెన్! 88

చ॥ సదయుఁడు చారువిగ్రహుఁడు ♦ సజ్జనుఁ డన్నము గుడ్డకోర్చు సం
పదగలవాఁడు నోర్పుగల ♦ వాఁడు సమీపగుఁ డబ్బెనేని మే
ల్గద! త్వరతోడ నీకుఁ దగు ♦ కాపురమున్ గడతేఱునేని – నా
కొదవలు తీఱు! సుంత కను ♦ కూర్కెద రేయిని జిత్తశాంతితో! 89

ఉ॥ కావునఁ బెండ్లి కిష్టపడఁ ♦ గావలెఁ! గాదని నన్ను నాత్మహ
త్యావిధిపాలుసేయకుము! ♦ దండ్రిఁ గృపన్ గనఁబోలు” నన్నఁబు
ష్పావతి నేత్రపద్మముల ♦ బాష్పము లొల్కఁగఁ “దండ్రి! చింతిలం
గావల! దేను నీనుడుల ♦ గారవ ముంచి మనస్కరించెదన్! 90

మ॥ నను నత్తింటికి సాగనంపినను జిం ♦ తన్ దాళలేవంచు-నే
జన, నీవొంటిగ నుండఁజాలవని-యా ♦ శ్వాసింపగా నేరలే

రని, నాకున్ మదిఁదట్టి యంటి! నిది త ♦ ప్పైనన్ గృపన్ జూచి నీ
తనయన్ మన్నన సేయుమీ! మృదుపద ♦ ద్వంద్వంబు సేవించెదన్!" 91

మ॥ అని యత్యాదరవృత్తిఁ బల్కన-నతం ♦ డాహ్లాదమున్ బొంది "నం
దన! నీయం దొకతప్పు గల్గునె! యుదా ♦ త్తంబైన నీవృత్తి నూ
తనమే! మంజు శిరీష కోమలము గా ♦ దా! నీకు సౌఖ్యంబుఁ గూ
ర్చిన నేధన్యుఁడనౌదునంచు మది నా ♦ శింతున్ త్రికాలమ్ములన్! 92

చ॥ అనుటకు నంటి! నీపరిణ ♦ యంబు ముగించి త్వదీశు మందిరం
బునకును నిన్నుఁబంపుచును ♦ బూర్వము నీవు వసించు నీగృహం
బున నిముసంబు నిల్వఁగల ♦ పోడిమి యుండునె! యెట్టులేనియున్
నిను నొకయింటిదానిగను ♦ నిల్పుట నావిధి! కానఁ దెల్పితిన్! 93

"వరనిర్ణయము"

ఉ॥ నాఋణ మెల్లఁదీఱు వయి ♦ నం బది కల్గదు! చూడ నెంతయున్
భారమునై తనర్చెడి! ది ♦ నంబులెకాని యికెంత కాలమో
యోరుపువట్టి మోహనుఁడు ♦ నుండమి నిక్కము! భోగభాగ్య వి
స్తారుఁడు! మంజువర్తనుఁడు! ♦ సత్కులజాతుఁడు వాఁడు పుత్రికా! 94

మ॥ పలుమాఱాతఁడు ప్రీతి యుట్టిపడ నీ ♦ పైఁ జిత్తమున్ మోపి పెం
డిలియాడన్ దలపోయు! నప్పనకుఁ బీ ♦ డింపండు! తాకట్టు పి
చ్చలుగాఁ బత్రములెల్ల వెన్కకిడు! భూ ♦ షారాసులన్ వస్త్రకో
టులఁ బెట్టంగలఁ! డిట్లు పెండ్లియగు! న ♦ ట్లున్ దీఱు నప్పంతయున్! 95

చ॥ తెలిసినవాఁడు! నిన్ననుమ ♦ తించినవాఁడు! పదానఁ జూపినన్
దలఁగొని చేయువాఁడు! ధన ♦ ధాన్యతతుల్ గలవాఁడు! చెప్పినన్
వలసిన గారవం బొనరు ♦ పన్ గలవాఁడు! మదీయమానసం
బలరును నీవు వాని హృద ♦ యాధిపుఁగాఁ గొన సమ్మతించినన్! 96

ఉ॥ ఆతనిమాట యెత్తిన ము ♦ ఖాబ్జము చిట్లుకొనంగఁబోకు మ
మ్మా! తగినట్టివాఁడు! హృద ♦ యంబున దాపఱికంబులేకెదో
రీతిని బల్కుచుండు! విప ♦ రీతవిధం బెఱుఁగండు! వానిదా
చేత మెఱుంగుదున్! మనము ♦ చేయఁగఁబోలిన వియ్య మన్నిఁటన్! 97

మ॥ అడుగం డప్పని యెంతు! నాస్తిఁగొన నా ♦ శావిష్టుఁడై యుండఁబో
వఁడు! నేఁ బుత్రినొసంగఁబోవ ననుచున్ ♦ వాక్రుచ్చినన్-వానిలో
యెడఁదన్ గల్గిన రంగు బైటపడు! నీ ♦ విద్దాని యోజింపుమీ
తడవున్ జేసిన నాదుకొంప మునుఁగున్ ♦ దథ్యంబు నాతల్లిరో! 98

శా॥ నాయీ మాటను బాటిసేయవలయున్ ♦ నాతల్లి! జాగైనచో
న్యాయజ్ఞానముఁజొచ్చు మోహనుఁడు! నా ♦ జ్ఞన్‌బొంది దుర్గంబునన్
న్యాయంబొప్పఁగ వేలమున్ సలుప య ♦ త్నంబూను! నాక్షోభ మే
మై యెట్లుండునో! శాంతిమై మనక నే ♦ లా రచ్చలున్ రాయిడుల్! 99

ఉ॥ వీరనృసింహరాయఁడనఁ ♦ బేరును బెంపు గడించి తోడి స
ర్దారులయందు మేటియని ♦ ప్రస్తుతికెక్కి "ఋణంబుఁదీర్పఁగా
నేరక యాస్తినమ్ముకొనె ♦ నీచుఁ"డటంచపకీర్తి మోయఁగా
నేరక తల్లి! యీకరణి ♦ నిన్ బ్రతిమాలితి మాటిమాటికిన్!" 100

మ॥ అన-నయ్యంగన "తండ్రి! మోహనుఁడు న♦త్యంతంబునన్ మంచి వాఁ
డని వాక్రుచ్చితి! వాతఁడిట్టిపని సే ♦ యన్ బూనఁగా నేర్చునే"
యనఁ! "దల్లి! మదిలోని వాంఛ సఫల ♦ మ్మైనన్ ముదంబొందుఁ! గా
దనఁ-గ్రౌర్య మ్మభిమానమున్ బెరిగి చి ♦ త్తాబ్జం బధిష్ఠింపవే!" 101

క॥ అనుమాట నందుకొని సుత
"జనకా! నన్నిప్పు డట్టి ♦ శఠునకుఁ గ్రూరా
త్మున కీయ నెంతువే" యని
తన కనుగవ బాష్పవితతిఁ ♦ దద్దయు నింపన్, 102

క॥ కనుగొనఁజాలక తనప
ల్కిన పలుకులె చిక్కనుగలి ♦ గించె ననుచుఁ 'గ్రో
వనుమూర్తు' నంచు నరసిం
హనృపాలుఁడు తలఁచి తనయ ♦ యాస్యముఁ గనుచున్, 103

క॥ "విను మిప్పుడు తల్లీ! నీ
జనకుని కష్టములఁ దీర్చు ♦ సంకల్పము గ
ల్గిన-నీకొంచెము త్యాగముఁ
బొనరింపకతప్ప" దనినఁ ♦ బుత్రి వగపుతో! 104

క॥ "జనకా! మతి.సమ్మతినొం
దని యీకార్యంబు నెపు డో ♦ నర్పఁగ వలెనో
వినిపింపుము! మనమున యో
జనసేయుచు నిర్ణయంబు ♦ సలిపెద నిపుడే!" 105

చ॥ అన-నరసింహరాయఁడు భ ♦ యమ్మున మోము వివర్ణమంద "నో
తనయరో! పత్రముల్ గడువు ♦ దాఁటెడి నెన్మిదినాళ్ల! కంతలో

ననె శుభలగ్నమున్ జరిపి ♦ నన్ గడుమే! లటుకానిచో నతం
డును దగుచర్యఁ గైకొని ని ♦ నున్ నను దుర్గమునుండి తోలెదున్ ! 106

మ॥ కలకాలంబును నీకు నాకు ననుఁగుం ♦ గాణాచి యీదుర్గమున్
దొలిఁగింపన్—గతిలేని పక్షులవలెన్ ♦ దుఃఖించుచున్ గూటిపై
దలమై లోకులపంచలన్ బడి మురం ♦ తంబా భుభుక్షార్తి శో
షిలి స్రుక్కన్ వలె నన్న—నాహృదయ మి ♦ స్సీ! వ్రక్కలై పోవదే! 107

చ॥ కలఁగను నాకునై! తెగిన ♦ గాలిపటంబను! సైతు సర్వమున్ !
జెలులు సహస్ర మూడిగము ♦ సేయఁగ—హర్మ్యములందుఁ బూలసె
జ్జలను మెలంగు నిన్ను సువి ♦ శాలజగంబునఁ బాఱఁదోలి యె
ట్టులు మననేర్తు! నియ్యది క ♦ డుంగడుఁ గష్టము గాదె! తల్లిరో! 108

మ॥ జనకుం డాస్తిని గోలుపోవుచుఁ బ్రపం ♦ చంబందు బిచ్చంబటుల్
వనటన్ బొంది యకాలమృత్యువునకున్ ♦ బాలాట యొక్కండు—మో
హను నెట్లో వరియించి యాపదలఁ బా ♦ యన్ జేయు టొక్కండు—నా
తనయా! వేఱొక త్రోవయున్న—నిను వం ♦ తన్ ముంతునే యింతగన్ ! 109

ఉ॥ కూడదు వీనిమాట యను ♦ కొందము! వేఱొకఁ డప్పుఁడా వరున్
జూడఁగఁబోలుఁ! బెండిలిని ♦ శోభిలఁజేయఁగఁ బట్టు ద్రవ్య మే
నేడ గడింతు! లోకమున ♦ నెవ్వరు నాకు ఋణంబు నిత్తు! రీ
జాడ యసాధ్యమై! మిగుల ♦ సాహసమా! ఫల మట్టి శూన్యమా! 110

గీ॥ రెండుమూఁడేండ్లుగాఁ బవల్ ♦ రేయు నిట్లు
బహువిధాలోచనములు కు ♦ ప్పలుగఁగలుగు!
క్షణమునం దన్ని గంగలోఁ ♦ గలిసిపోవు!
నంతమున మోహనుఁడె గట్టి ♦ యనుచుఁ దోఁచు! 111

మ॥ మదియోజింపుము! నాయధీనమగు నీ ♦ మాన్యంబులున్ గోటయున్
విదితస్ఫూర్తిఁ బరావృతంబులయి "లో ♦ భీ! దుర్గమందుండియున్
గదలన్ బాఱు మటంచు రాజభటులున్ ♦ గర్జించి భర్జించు నా
పద నూహించినయంత నా హృదయమున్ ♦ భగ్నంబునై పోవదే! 112

గీ॥ ఒకట నీపెండ్లిభార—మిం ♦ కొకటఁ దీర్ప
నోపని ఋణభారమ్ము — వే ♦ ఱొకట ముంచు
కొను జరాభార—మిన్ని నె ♦ క్కొనుచు నేను
తల్లి! నేఁడు త్రేతాగ్ని మ ♦ ధ్యమున నుంటి! 113

ఉ॥ మోహనుఁ డొక్క చందమునఁ ♦ బోయెడువాఁ! డయినన్ బదేండ్లు వ్యా
మోహముతోడ నుంట - లవ♦మున్ గృపలేక మహోగ్రదీర్ఘ శే
షాహివలెన్ బయిన్ దుముకు ♦ నంచని తోఁచెడి! రాజశాసన
వ్యాహృతి వానిపక్షమయి ♦ వర్తిలు! నా కిఁక దిక్కు గల్గునే! 114

ఉ॥ ఎన్ని సుఖాబ్దముల్ గడచె ♦ నేనును-నీవు వసింపఁబట్టి! నా
దన్నతలంపుతోడ వ్యవ ♦ హారము లన్నియుఁ దీర్చుచుంటి! నా
కన్నులమ్రోల దుర్గమును ♦ క్ష్మాతల మన్యుల పాలుగాఁగ-నే
ను న్నిముసంబు ప్రాణముల♦నున్ మెయిఁదాల్చి మనంగనేర్తునే! 115

మ॥ జనకుండన్! ముది మూఁడుకాళ్ల ముదుకన్! ♦ సంసారదుర్వార వే
దనలన్ స్రుక్కినవాఁడ! దుర్బలుఁడ! నా♦దైన్యస్థితిన్ జూచి నీ
మనసున్ మోహనుజేర్చి నేఁడతని స♦న్మానింపఁగాఁ జూడు! మో
తనయా! గడ్డము వట్టి వేడుకొనెదన్! ♦ దాక్షిణ్యమున్ బెంపుమా! 116

శా॥ "ఈ సాయంతన మేగుదెంచెదను! నె♦ల్లే బెండ్లిమాటెత్తి మీ
రా సౌభాగ్యవతిన్ సమాయతము సే♦యన్ జూడుఁడీ" యంచు వి
శ్వాసప్రక్రియ విన్నవించెను! భవ♦త్స్వాంతం బదెట్లున్న సం
తోసమ్మున్ నటియింపుమీ సముఖమం♦దున్ వాఁడు మాటాడినన్! 117

క॥ వరసుత! నీసాహాయ్యము
తరమె పొగడ! సాయమనుచుఁ ♦ దలఁపను! నన్ను
ద్ధరణ మొనర్పెడి యుత్తమ
వరమని హర్షింతు! జిక్కు♦వాసి రహింతున్! 118

మ॥ తను బెండ్లాడఁగ రాజరాజులును శ్ర♦ద్ధాభక్తులన్ వేచియు
న్నను బుష్పావతి తండ్రి సేమమును డెం♦దంబందుఁ గాంక్షించి మో
హను బెండ్లాడుచు శాశ్వతంబుగ స్వ-సౌ♦ఖ్యత్యాగమున్ జేసెఁబో
మ్మని సిన్ మెత్తురు! కీర్తికన్నను నపే♦క్ష్యం బుండునే తల్లిరో!" 119

మ॥ అని ప్రత్యక్షము గడ్డమంటి పలుమా♦ఱర్థించి ప్రార్థించు నా
జనకున్ దూరముచేసికొంచు వెత ముం♦చన్ లేక "నా పెండ్లిచే
జనకా! నీవెతలున్ దొలంగిన - నవ♦శ్యం బట్టులే సేతుఁబో"
మ్మని వాక్రుచ్చె లతాంగి, మానసము వ్ర♦య్యల్ వ్రయ్యలై పోయినన్! 120

మ॥ తన సత్పుత్రిక యిష్టమున్ గనక చిం♦తన్ గుందినన్-తీర్పలే
నను తాకట్టుఁ దొలంపఁగాఁగల యుపా♦యంబున్-వెతల్ దీఱితా

ననయంబుల్ సుఖమొందఁగాఁగల యుపా♦యంబుల్ గనుంగొంటి నే
నని యవ్వీరనృసింహరాయఁడు మదిన్ ♦ హర్షించి శాంతిన్ గనెన్ ! 121

మ॥ తన ప్రాణమ్మునకన్న మిన్నయని వా♦త్సల్యము పాటించి పెం
చిన యా తండ్రికి గల్గినట్టి యిడుముల్ ♦ చిక్కుల్ దొలంగించుటల్
తన ధర్మంబని పుత్రి దుష్కరతర♦త్యాగంబు భావించెఁ! గా
దనినన్ బూవఁగనున్న ప్రేమలతఁ గో♦యన్ బ్రహ్మకున్ సాధ్యమే! 122

"మోహనుఁడు చంద్రమహాలు కోటకు వచ్చుట"

సీ॥ వందలు వేలును ♦ వ్యయమొనర్చిన చీని
చీనాంబరములు నె♦మ్మేనఁ దాల్చి!
మొకమాలు పట్టు సొం♦పులుగుల్కు జలతారు
పింజెలు ప్రేలు టో♦పీ ధరించిఁ
యా టోపిపైన బా♦హాటంబు-వాటమై
రాణించు కలికి తు ♦ రాయి నుంచి!
కరపద్మమందు బం♦గారును రతనముల్
దనరారు నాగబె♦త్తంబుఁ బట్టి!

గీ॥ బెడఁగు బొండుమల్లెల దండ ♦ మెడను ప్రేల
మోహనుఁడు ముఖచూర్ణ వి♦స్ఫురణ మలర
నాత్మకాంభోజహయముపై ♦ నధివసించి
వెడలెఁ దిరునాళ్ల యుత్సవ ♦ విగ్రహ మటు! 123

క॥ మది నలరి నృసింహాధిపు
డెను రేగుచుఁ దోడితెచ్చి ♦ గృహమునఁ జేర్చెన్!
దుద కేటులో మోహనుఁడే
మదనోపముఁ డనుచు నతని ♦ మదికిన్ దోఁచెన్! 124

గీ॥ "సిన్న-వంగదేశంబు క్షో♦ణీవిభుండు
మహిత రాజకీయములు వి♦మర్శచేయ
వచ్చి-నిముస మూపిరివోని♦పనులు వెంచి
యిపుడు విడిచె! గుఱ్ఱము నెక్కి♦యిటు వెడలితి! 125

క॥ అది యెంతదైనఁ గలదిఁక
నదివర్ణనసేయఁ బూన ♦ నంతము గలదే!
మొదలు తుద నేనె యెఱుఁగను!
మదిఁబూనిన కార్యమిపుడు ♦ మాఱై పోవున్! 126

క॥ నరసింహరాయ! నీకూ
తుది మది కనుఁగొంటె! స్వేచ్ఛ♦తో నిప్పుడు నే
దరియుదునె! యెందుఁగల దా
వరవర్ణిని! చూచి మిట్టి ♦ పడఁబోదు గదా!" 127

క॥ అను-మోహనుఁ జేసన్నలఁ
దనుఁ జేరఁగఁ దీసి "నాదు♦తండ్రీ! పనిమా
లిన వెఱ్ఱిమాట లాడకు!
మనువుగ మటాడు! లాభ♦మగు" నన-నతఁడున్! 128

క॥ "ఒక్కఁడు రెండక్షరముల
కెక్కువ మాటాడఁ జూడు! ♦ మింతగ నీవున్
నొక్కవలెనె! నే నంతటి
మొక్కలినే! ముందు చూపు ♦ పుష్పావతినిన్! 129

చ॥ అనఁ-'బయిమేడనున్న'దని ♦ యాయన దెల్పెను! మేడయెక్కి మో
హనుఁడును దద్విలాస సుభ♦గాకృతి ప్రస్ఫుటమై కనంబడన్
జని నరసింహరాట్తనయ♦సన్నిధి సొట్టఁగ నిల్చి "కాంత! ని
న్గనుఁగొన వచ్చినాఁడ! వినఁ♦గాఁదగు నాదగు దివ్య వాక్యముల్! 130

"మోహనసింహుని ప్రధానోపన్యాసము"

క॥ ఎంత యవసరముగలదో
యంతకు నెక్కుడుగ మాట ♦ లాడెదనని భా
వింతురు కొందఱు! నీకడ
నెంతయు సంక్షిప్తరీతి ♦ నిపుడు పలికెదన్! 131

క॥ కలవాణీ! బ్రహ్మాండము
తలక్రిందై పోవు ననుచుఁ ♦ దలఁపకు! నామా
టల నాలకించి విని నీ
తలఁ పనుకూలముగఁ దెలిపి ♦ దయఁగను మమ్మా! 132

మ॥ కమలాక్షీ! తొలుదొల్త నీకిపుడు నా ♦ ఖ్యాతంబుగా-నాదు వే
శ్మమునున్ గూర్చి-ధనంబుఁగూర్చియుఁ బ్రకా ♦ శప్రాభ వైశ్వర్య భో
గములన్ గూర్చి వచింపఁ జుల్కఁగ నెఱుం ♦ గన్ నేర్తు! కాదేని స్ప
ష్టముగాఁగన్ గ్రహియింపఁజాల! వటులౌ ♦ టన్! నీకు వాక్రుచ్చెదన్! 133

చ॥ స్థిరగుణరాశి యాయభయ ♦ సింహుఁడు నాజనకుండు! పూర్వమున్
దరుణవయస్కుఁడైనపుడు ♦ తత్సతి నాజనయిత్రి మాతృమం

దిరముననుండియుఁ ధనముఁ ♦ దెచ్చె! నతండును దాని వృద్ధికిన్
దిరుగఁగఁజేసి పెంచెను గ ♦ ణింపఁగ లక్షలుఁ గోటులౌ నటుల్! 134

శా॥ ప్రాకారంబులు కుట్టిమంబులు బహి ♦ ర్ద్వారంబు లొప్పార నె
త్త్రై కన్నుల్ మిఱుమిట్లుగొల్పెడు హిర ♦ ణ్యప్రాజ్య సౌధావళుల్
నాకున్ గాపురమాను! ''వజ్రఖను''ల ♦ న్నామంబునన్ బొల్చు! నే
క్ష్మాకాంతుల్ వసియింపఁగోరుదురు త ♦ త్సౌందర్యమున్ జూచుచున్! 135

చ॥ కడితము లట్టె వే ల్గలవు ♦ గాక! ధనంబుల ప్రోవులెల్ల లె
క్కిడఁగను నేరిసాధ్యమగు! ♦ నింటికడన్ గడపంచఁ గాచు నా
కడపటిభృత్యుసంపద నొ ♦ కానొక వేయవపాలు నేనియున్
బడయఁ గుచేలుఁడున్ బ్రదుక ♦ వచ్చునుబో శతకోటి జన్మముల్! 136

చ॥ తడవుగ నేలమాలియలు ♦ త్రవ్వఁగఁజేసి ధనంబురాసులన్
బుడిగలఁబోసి దొంతులుగఁ ♦ బూన్చిరి! లక్షలొ కోట్లొ యె
వ్వఁడెఱుఁగు! నాలుగేడులును ♦ బస్తులు పస్తులు దీసి వాడితిన్!
గడగన దొక్కసిద్దెయును! ♦ గామిని! యేమని నీకుఁ దెల్పుదున్! 137

సీ॥ అతివరో! చంద్రమ ♦ హల్ దుర్గముననుండి
పైన నుండెడు 'మహో ♦ బా' వఱకును!
నామహోబానుండి ♦ యవ్వల జయచంద్ర
పతియుండు కాన్యకు ♦ బ్జంబు వఱకుఁ!
గాన్యకుబ్జమునుండి ♦ ఘనుఁడు పృథ్వీరాజ
రాజుండు ఢిల్లీపు ♦ రంబు వఱకు!
ఢిల్లీపురమునుండి ♦ తెల్లమంచు రహించు
కాంచనశైల శృం ♦ గంబు వఱకు!
గీ॥ నచటినుండి దక్షిణభార ♦ తాంతమందు
మహిమ దీపించు కన్యాకు ♦ మారి వఱకు!
నుడు కుడుకు రూప్యములు కుప్ప ♦ లడరఁ బోసి
యింతిరో! వెండిబాట వే ♦ యింపఁగలను! 138

గీ॥ తలపయినఁ గొమ్ము మొలిచిన ♦ బలియునైన
సరకుసేయక యధికారి ♦ సరణిఁజూతు!
రోసపడి యెవ్వఁడేని జేఁ ♦ జేసికొనిన—
దవమహాజ్వాల ముద్దాడఁ ♦ దివిరి నట్లె! 139

శా॥ నాముద్దున్ జనయిత్రి బాల్యమున నం ♦ తంబొందె! నాతండ్రి కు
య్యో మొఱోయని — పైడి యుయ్యెలలపై ♦ నూగించి నన్ బెంచె! నే

నో మేన్వంచక సర్వభోగముల నెం ♦ దున్ గంటి! నాగర్భ సు
శ్రీమంతుండన స్వేచ్ఛమైఁ బెరిగి వా ♦ సిన్ వన్నెయున్ గాంచితిన్! 140

క॥ 'నడచినను మట్టిసోఁకెడి
నడుగుల'కని క్రింద దింప ♦ కట్టె శిరముపై
నిడి పెంచెఁగాని – పలుమఱు
బడి కేగుమటంచుఁ దండ్రి ♦ బాధించె నన్నున్! 141

గీ॥ అట్టె ముడివెట్టి–పెడమోము ♦ పెట్టి–పలక
కాముదము పూతు! బొత్తమ్ము ♦ లన్ని చించి
చీరికలుచేసి బయలఁ దూ ♦ ర్పార విడుతు!
నయ్యవారిని డాసి క్ర ♦ య్యంగఁబడుదు! 142

గీ॥ బడిచదువునాఁటి లగువులు ♦ పలుకనేల!
యెన్నిబుద్ధులు చెప్పిన–♦ నేమనినను–
బూని నలువుర చేతుల ♦ పైనఁ గాని
నాతనువు సాఁగలే దొక ♦ నాఁడుగూడ! 143

ఉ॥ ఎచ్చటి కేగనీక మన ♦ యింటనె పంతుల నిల్పఁజేసి నా
కచ్చును విద్దెనేర్పు మని ♦ యాజ్ఞ యొనర్చెను దండ్రి! తప్పుకో..
నెచ్చటఁజోటులేక యయి ♦ దేడులు నేర్చితి! నెంతనేర్వ–నే
నచ్చులెకాని, నేఁటికిని ♦ హల్లొకఁ డైన నెఱుంగ నంగనా! 144

మ॥ మొదటన్ ముక్కిడి పైనశైత్య మను చో♦ప్పున్ దోప–విస్తార సం
పద చేఁజిక్కెను! దండ్రి పోవుటను నేఁ ♦ బాఠంబులన్ నేర్వమిన్
జదువుల్ సంధ్యలు చట్టుబండ పడియెన్! ♦ శాస్త్రమ్ము వమ్మయ్యె! నె
య్యది యెట్లున్నను దిండికోసరము కా ♦ వా! వేదముల్ శాస్త్రముల్! 145

గీ॥ బిక్కిపండ్లు గోయంగఁ జె ♦ ట్టెక్కియుంటిఁ!
గనులు మబ్బులుగ్రమ్మె! వా♦క్కాంత వచ్చి
సకలవిద్యోపదేశం బొ ♦ సంగె! నిపుడు
సర్వవిద్యాధిదేవత్వ ♦ సంజ్ఞఁ గందు! 146

సీ॥ తరువుకాఁడయి కాళి ♦ దాసుండు నాపంచఁ
బడి కొల్చి రామశ ♦ బ్దంబు నేర్చె!
భవభూతికవి గణ ♦ ప్రస్తార సంగ్రహం
బెవ్వానికడఁ బఠి ♦ యించె నందు!

వ-ఇ-ఉ ల్మొదలుగ భా ♦ ష్యాంతంబుదాఁక నా
వ్యాసమహర్షి కై ♦ వ్రాఁడునేర్పె!
మిగులఁ గష్టించి వా ♦ ల్మీకికి కో-నా-మాలు,
వ్రాయించినట్టి స ♦ ర్వజ్ఞుఁ డెవఁడు!
గీ॥ విజ్ఞజనశిరోమణి త్రికా ♦ లజ్ఞమూర్తి
చంద్రభట్టారకాచార్య ♦ సత్తమునకుఁ
బలకఁ గొనియిచ్చిన భువన ♦ ప్రాజ్ఞుఁడెవ్వఁ!
డేను లేకున్నఁ గవిత కిం ♦ కేది దిక్కు? 147

సీ॥ "బ్రహ్మాండభాండ వి ♦ ద్వచ్చండ పిండాండ"
బిరుద మర్పించెఁ గాం ♦ పిల్యనగరి!
"ప్రళయమార్తాండ భై ♦ రవ కృతాంతసమర్థ"
చిహ్నంబొసంగెఁ గా ♦ శీపురంబు!
"నవకోటిదర్ప కం ♦ దర్పమోహనమూర్తి"
బిరుదంబునొసఁగె ధోం ♦ గరుపురంబు!
"విశ్వప్రపూత గో ♦ విందప్రభామూర్తి"
సంజ్ఞయొసంగె వా ♦ సంతపురము!
గీ॥ నవ్యసౌజన్య ధన్య మం ♦ దార బిరుద
మును సమర్పించెఁ బాటలీ ♦ పుత్రవరము!
లలన! ననుఁబోలు కీర్తికై ♦ లాసశిఖరి
వసుధఁ గలుగునె కోటి క ♦ ల్పములకైన! 148

సీ॥ నేపాలనృపతి కా ♦ నికపంచు బంగారు
గంగాళములు మూల ♦ గాజువాఱు!
లాటేశ్వరుఁడు ప్రేమ ♦ లక్షణంబుగఁ బంచు
గజకోటి వాఁకిటఁ ♦ గాంచియుండు!
హూణరాజేశ్వరుం ♦ డుపద వంచిన హేమ
డోలికల్ కప్పుల ♦ వ్రేలుచుండు!
నిందూరిపతి బహూ ♦ కృతిసేయు ముక్తాత
పత్రముల్ కడుబూజు ♦ పట్టియుండు!
గీ॥ సాళ్వభూజాని పంపు వ ♦ జ్రాలబండ్లు
నింటిచూరునఁ బడి సొట్ట ♦ లెత్తియుండుఁ!
బలుక సాధ్యంబె నాభాగ్య ♦ వైభవములు
ఫణిపతికి! వాక్పతికి! నుమా ♦ పతికినైన! 149

సీ॥ సకలసంపదల క ♦ క్రాంత భాండారంబు!
సర్వసౌఖ్యముల కా ♦ స్థానవాటి!
భోగసంతతులు కా ♦ పురముండు సదనంబు!
భాగ్యలక్ష్మీదేవి ♦ ప్రసవసీమ!
వైభవంబు వసించు ♦ వైజయంత గృహంబు!
కామధేనువు గట్టు ♦ గాడిపట్టు!
శృంగారలక్ష్మికి ♦ సింహేంద్రపీఠంబు!
నాగరకతకు జ ♦ న్మస్థలంబు!
గీ॥ భవనమాత్రంబె నాయిల్లు! ♦ స్వర్ణగిరియె
దాని యాకృతిఁగొని ధాత్రిఁ ♦ దనరెఁగాక!
చెలువరో! యెంతపున్నెము ♦ చేసినావొ!
కోరి నాయింటికిని నీవు ♦ కోడలైన! 150

సీ॥ అల మహోబానేత ♦ యగు పూర్ణమల్లుండు
చెలిమిఁగోరుచుఁ బెద్ద ♦ చీటి వ్రాసెఁ!
గేరళేశుఁడు నమ ♦ స్కృతిచేసి 'యిందాక
వచ్చిపొ'మ్మని వేయి ♦ వార్తలంపె!
లాటేశ్వరుఁడు కాన్క ♦ లను బంపి ముఖదర్శ
నముఁ బ్రసాదింప వి ♦ జ్ఞప్తినంపెఁ!
బాంజాలపతి పదా ♦ బ్జములకుఁ బ్రణమిల్లి
యొకచూపు చూడుమం♦చు పదఁబంపె!
గీ॥ బాహ్లికుఁడు మైత్రికై మంత్రి ♦ వదలఁ బనిచె!
హైహయుఁడు మ్రొక్కిమొక్కి 'దా ♦ సోహ' మనియెఁ!
సాళ్వపతి మోడ్పుఁగేలఁ బం ♦ చలను గాచె!
భోజుఁ డేవేళఁ బాదముల్ ♦ పూజ చేసె! 151

సీ॥ భారతాఖండ దు ♦ ర్వార మార్తాండాది
విఖ్యాత బిరుదముల్ ♦ వెలయుమేటి!
వేయియుద్ధములందు ♦ విమతుల విదలించి
యభినవార్జునకీర్తి ♦ నందు వీరుఁ!
డష్టోత్తర శతసం ♦ ఖ్యాక సామంతవ
ర్గము నేలు వైభవా ♦ క్రాంతమూర్తి!
తుహినాద్రినుండి సే ♦ తువుదాఁక విశ్వభూ
చక్ర మేలెడు మహా ♦ సార్వభౌముఁ!

గీ॥ ఢిల్లి చోహాణనృపతి-పృ ♦ థ్వీశ్వరునకు!
విజ్ఞజనమౌళిమణి త్రికా ♦ లజ్ఞమూర్తి
చంద్రభట్టారకుని బంపి ♦ శంక లెల్లఁ
దీర్చుకొనుచుండు నను సంప్ర ♦ తించి దినము! 152

సీ॥ పెటగోనియా మహీ ♦ విభుకోర్కె నరిగి వా
జిసమూహములఁ బరీ ♦ క్షించి వత్తు!
నాస్ట్రేలియా ధరా ♦ ధ్యక్షుండుపిలువ న్యూ
జీలాండు కలిమి వీ ♦ క్షించివత్తు!
ట్రాన్సువాలు సీమ 'స్వ ♦ ర్ణమును' – గింబర్లే – 'మ
హావజ్రముల'ను నే ♦ నరసి వత్తు!
నల మలాకాదీవు ♦ లందున విహరింతు!
సండమాన్ దీవు ల ♦ క్షప్పుగందు!
గీ॥ లీల రేండీర్లఁ బూన్చిన ♦ స్లెడ్జిబండ్లఁ
గూర్చుకొని యుత్తరధ్రువ ♦ క్షోణిఁగలుగు
చిత్రములు పలుమాఱు వీ ♦ క్షించివత్తు!
నేను జూడని నేల యెం ♦ దేని లేదు! 153

సీ॥ సహారా యెడారిలో ♦ సంచరించెడు వింత
యాస్ట్రిచ్చుకోళ్ల నీ ♦ వరయువచ్చు!
నాఫ్రికాఖండమం ♦ దతిజవోపేతముల్
జీబ్రాలఁ గాంచి హ ♦ ర్షింపవచ్చు!
నాస్ట్రేలియా నిబి ♦ డారణ్యములను గం
గారు – డింగోలను ♦ గాంచవచ్చు!
గంధిఁబడినవారి ♦ గాచు న్యూఫౌండ్లాండు
శునకకోటుల నీవు ♦ చూడవచ్చుఁ!
గీ॥ దెల్లని యెలుంగుబంట్లను ♦ దెల్లయేన్గు
గములఁ దెల్లనికాకులఁ ♦ గనఁగవచ్చు!
క్షోణిఁగలిగిన చిత్రముల్! ♦ చూడకున్న
వసుధపైఁ బుట్టువొందియు ♦ ఫలము గలదె! 154

ఉ॥ ఇమ్మహనీయరాజ్యమున ♦ నీదిన మీత్రుటిఁదాఁక బాంధవా
రమ్ముల ముట్టి వారి ధన ♦ రాసులఁ గొల్లలుగొట్టు చోరసం
ఘమ్ముల 'కుక్కుము' ల్లని ని ♦ కామయశంబు గడించియుంటి! యు
ద్ధమ్మున సైన్య మన్న వని ♦ తా! యొక లెక్కయు లేదు! నాకెటన్! 155

సీ॥ ఆభీలశౌర్య భో ♦ ళాభీము గుండియల్
రాలఁగొట్టితిని సౌ ♦ రాష్ట్రమందు!
జయచంద్రుఁ గాన్యకు ♦ బ్జముద్రోలఁ బెడకట్లు!
బిగియించి గోతిలో ♦ వేసియుంటి!
ఢిల్లి పృథ్వీసింహ ♦ వల్లభుఁ డనిని లో
బడినప్డు దయయుంచి ♦ విడిచియుంటి!
జగదేకవీరుఁడౌ ♦ సమరసింహ విభుండు
చెఱనుండె నాదు మం ♦ దిరమునందు!

గీ॥ నాది భారత – రామాయ ♦ ణాహవమ్ము
లుద్ధతిని సాఁగినప్డు నే ♦ నుండియున్నఁ
బట్టి పాండవ కౌరవ ♦ ప్లవగ దైత్య
కోటులను బిండిపిండిగాఁ ♦ గొట్టియుందు! 156

క॥ పెక్కులు వక్కణ లేటికి
జుక్కల నాసకమునందు ♦ సొంపులు గులుకన్!
జెక్కిన దెవ రనుకొంటివి?
నిక్కముగా నేనుగాక ♦ నీరజనయనా! 157

చ॥ జలజదళాక్షి! రేలు సుమ ♦ శయ్యఁబరుండి తపింతుఁగాని క
న్నుల కరనిద్దురేనియును ♦ నూల్కొనఁబోదు! పవల్ · రవంత యా
కలి యుదయింప! దెప్పుడు జ ♦ గన్నుతమౌ భవదీయమూర్తి నా
తలపున నిల్చి కోరికలు ♦ తద్దయు రేఁపును వెట్టి మొట్టిగన్! 158

గీ॥ వినుతు నొక్కరహస్యమో ♦ వెలఁది! పవలు
కన్నుసన్నలఁ జరణయు ♦ గ్మమ్ముఁ గొలుతు!
రేలు మఱచి తప్పి కలువ ♦ రింతువేని—
చామ! 'యే' మని లేచి హ ♦ స్తములు మోడ్తు! 159

గీ॥ ఎందుఁ దిరిగిన నెటులున్న ♦ నేమిఁ గొనిన
నేమి మాటాడినను దప్పు ♦ లెన్నఁబోను!
నా సరసనున్నఁ జాలును! ♦ నన్ను నమ్ము!
నమ్మకున్న – (నిశ్చయము) ప్రా ♦ ణములు విడుతు! 160

క॥ ఒడలొత్తె – నలుగు లిడఁగా–
నుడుకుడుకగు నీరువోయు – ♦ నుడుపులు దొడుగన్–

జడ వేయఁ-బూలు ముడువఁగఁ-
బడఁతీ! నేనేర్తు! నన్ని ♦ పనులను దీర్తున్! 161

గీ॥ తిమిరపుం గోడెప్రాయంపుఁ ♦ దీవ్రతమెయిఁ
బూరుషుల పై వగలు చూచి ♦ మోసపోకు!
మిలఁ దృణావృతకూపంబు ♦ లెన్నొయుండు!
గోముఖవ్యాఘ్రములు పెక్కు ♦ కోటులుండు! 162

ఉ॥ నీవిటఁ గొంతసమ్మతి గ ♦ ణించిన నాకుఁ గొఱంత లేదు! నీ
పావనపాదపద్మములు ♦ పట్టి శిరంబునఁ బెట్టుకొందుఁ! బు
ష్పావతి! దుర్బలాత్మ ననుఁ ♦ జంపఁగఁజూడకు! కూర్మిఁజూపు! నా
సేవకుఁజేసెదన్ జెఱకు ♦ సింగిణిమోయు బికారి మన్మథున్! 163

ఉ॥ ఇక్షుధను స్తురుష్కుఁ డల ♦ యించి కలంచెడి! దిక్కులేని యీ
పక్షిని నీవిధేయుని గృ ♦ పన్ గని పెండిలి కియ్యకొంచు సం
రక్ష యొనర్పు! మేరును శ ♦ రణ్యులు లేరు! కృతజ్ఞతాప్తిమై
లక్షలు కోటులున్ ధనము ♦ లంచము లుంచెద నీపదద్వయిన్! 164

గీ॥ పెండ్లి వేయేండ్ల పైరగు! ♦ వేయికనులు
గలిగి జాగరూకతతోడ ♦ మెలఁగవలయు!
నధిపుఁ గోరు త్రోవలఁ దప్పు ♦ టడుగువడినఁ
గూడు కోకయుఁ గుఱచయై ♦ గోడు వడెదు! 165

గీ॥ తొమ్మిదేఁడులక్రింద నేఁ ♦ దొలుత వచ్చి
వెలఁది! నినుడాయ-వెఱగంది ♦ వెక్కివెక్కి
యేడ్వఁదొడఁగితి! వపుడె ని ♦ న్నేలుకొనఁగ
మనసునను గంపెడాస ♦ క ♦ ల్గినది! నాకు 166

క॥ ఈతొమ్మిదేండ్లనుండియు
నాతలఁపున నీవు నిల్చి ♦ నటియింతువు! నే
నీతో డనృతము లాడను
శీతాద్రిసుతాభిరామ ♦ శీల విశేషా! 167

ఉ॥ వాలికమాట లేల! నర♦పాలక కన్యక లైన-దేవతా
పాలక కన్య లైన - విను♦భామిని! నీదగు కాలిగోటికిన్
జాలరు! నీ విలాస రస ♦ సంభృతరూపముఁ గాంచినన్ జగ
జ్జాలములెల్ల మేల్పడి వ♦శంబయి వర్తిలు నీకు మానినీ! 168

చ॥ అలుగకుమీ! రహస్యముల♦యందు రహస్యము సుమ్ము! విత్తముల్
గలిగినవాఁడె ప్రాణములు ♦ గల్గినవాఁ! డదిలేని జన్మ ని
ష్ఫలము! సమస్తలోకముల ♦ సారము విత్త! మెఱుంగఁ జెప్పిరిల్
'గలిమి కులాలమిండఁ' డనఁ♦గా వినవే! యలినీలకుంతలా! 169

క॥ ధనహీను గుణత తొలఁగును!
దనువున రక్తంబు-మాంస♦తతులును దొలఁగుల్!
ధనహీనుఁ డగుటకన్నను
వనిఁ జట్రాయగుచుఁ బుట్టు ♦ వడయుట లగ్గా! 170

క॥ కను గలిగి మెలఁగువానికి
ధనము వలసినంతకన్నఁ ♦ దద్దయుఁ గలుగుల్!
వినియుండవె-నాపాలికిఁ
గనకంబనఁ జిల్లిగవ్వ♦కైవడి గనఁగల్! 171

చ॥ ధనమును ముందుముందుగనె♦తజ్ఞులు శ్రద్ధవహించి సంగ్రహం
బొనరిచి యక్కరైన-నుప♦యోగ మొనర్తురు! పుట్టుటాదిగా
మనసిడి కూర్పుకున్న విష♦మస్థితి నయ్యది గల్గుటెట్లు! ద
ప్పిని గొని బావిఁద్రవ్వెడు వి♦వేకులు కొందఱు వొల్తు రిద్ధరల్! 172

క॥ జననంబునుండి కడపటి
దనుకల్ గూర్చుండి తినినఁ ♦ దఱుగదు లవమై
నను మనయింటిని మూల్గెడు
ధన మది! మన పిల్ల-పిల్ల ♦ తరముల్ గడచుల్! 173

క॥ లలనా! చెలువల పదపాం
సుల లక్ష్మీవసించునంద్రు ♦ సూరిజనంబుల్!
చెలువుగల చెలులు మెలఁగని
నిలయము-సిరి-వైభవంబు- ♦ నిష్ఫలము గదా! 174

సీ॥ రమణిరో! నైమిశా ♦ రణ్యమం దొక్కనాఁ
డడుగిడ - నాదినా♦రాయణుండు
పెద్దయాపద నుండె! ♦ వెళ్లి నే నుపకరిం
చితి! విష్ణుమూర్తి రం ♦ జిల్లి "కొమర!
నీకు నూతేడులు ♦ నిండినంతనె నాదు
తెలిదీవి కేతెమ్ము! ♦ దివ్యమైన
గారుడహార్మ్యభా ♦ గములిత్తు! మఱి నీకు
నొడలితో నాదు సా ♦ యుజ్యమిత్తు!"

గీ॥ నని ప్రమాణము చేసి నా ♦ హస్తమందు
హస్తమును మోపె! నన్నుఁ బెం ♦ డ్లాడెదేసి
తరుణి! యిహముమా టటులుండఁ ♦ బరమునందు
శుద్ధ కైవల్యసంసిద్ధిఁ ♦ జూరగొనెదు! 175

గీ॥ సుదతిరో! కాళ్లముందటి ♦ చూపుచూచు
కొనకు! మీయవకాశంబుఁ ♦ గోలుపోకు!
సిరియురాఁగ మోకాలొడ్డి ♦ చెఱుచుకొనకు!
‘మోహనునిభార్య’ యన జగం ♦ బులు నుతించు! 176

ఉ॥ నామదిఁ బ్రేమపెంపును – ధ ♦ నంబు గురుత్వము–దానితోడనీ
క్షేమనిరూఢి–నిన్ని పరి ♦ కించెను దొడ్డ ప్రబుద్ధురాల! వె
ల్లె మదిపొందఁజేసి నను ♦ నేలుకొనంగ మనస్కరింపు! శ్రీ
రామునితోడు! నాస్మర వి ♦ రామునితోడు నినున్ భజించెదన్! 177

చ॥ పొరవడి యెప్పుడే నిముస ♦ మో మది యొండెడసోఁకి యుండినన్
మఱలఁగఁజేసి నిన్ను మది ♦ నమ్మిన న న్ననురాగదృష్టితో
నరసి సుకమ్ముఁగూర్పు! మబ ♦ లా! యిటులే డటు లేదు పూరుపాం
తరములదాఁక నాదు పితృ ♦ దైవతకోటిఁ దరింపఁజేసెదన్!” 178

మ॥ అను నామోహనువాక్యముల్ విన నస ♦ హ్యంబైనఁ బుష్పావతీ
వనితారత్నము “నప్పుసప్పులిడి కా ♦ పట్యం బెఱుంగంగఁబో
వని నాతండ్రిని మోసగించి బెదిరిం ♦ పన్ గల్లి నావంటి క
న్యను వేధించుట పాపకారణము గా ♦ దా! ధర్మ విధ్వంసకా! 179

క॥ నీకుఁగల సిరులు పలుమఱు
వాకొన్నవిగావె! మఱలఁ ♦ బలుకఁగ నేలా!
నీకడుపంతయుఁ బెనుకోత
లేకద! చాలింపు! వినఁగ ♦ లేను మహాత్మా!” 180

క॥ అన – “నావలెఁ బితృభక్తుని
ననుఁబోలిన ధర్మపరుని ♦ ననుఁబోలిన శో
భనవర్తను – నీజగమే
కని విని యుండదు నిజంబు ♦ కమలదళాక్షీ! 181

సీ॥ మును బురాణముల వి ♦ భూతిమహిమఁ బెక్కు
రీతుల మునులు వ ♦ ర్ణింప వింటిఁ!

బొరుగూరి కొక్కనా ♦ డరుగుచో మార్గమ
ధ్యమునందుఁ బ్రళయవా ♦ తంబు లేచె!
దండ – శ్మశానమం ♦ దలి బూది సుడిలేచె!
మూన్నాళ్లు బూదిలోఁ ♦ బూడిపోతిఁ!
దెఱవరుల్ వచ్చి లే ♦ పిరి! బూదిరాసిలో
నున్న నాకెటు పాప ♦ ముండనేర్చు!
గీ॥ యావగింజంత యఘము న ♦ న్నంటియున్న
బూదిసోఁకిన యప్పుడే ♦ పోలిసియుండు!
నలిననేత్ర! సాక్షాద్విశ్వ ♦ నాథుఁడ నని
ప్రజలు స్తుతియింత్రు నన్ను మా ♦ పల్లెలందు! 182
సీ॥ భావఁ – దొలసిచెట్టు ♦ పడి మొల్చె దొడ్డిలో!
వటవృక్షమంతరై ♦ వఱలె నవల!
భూధర గుహనోలెఁ ♦ బుట్టె నం దొకతొఱ్ఱ!
తొలసి మహత్త్వంబుఁ ♦ దెలిసియుండి
పదియేండ్లు తొఱ్ఱలోఁ ♦ బడియుంటి! నాకింక
నిసుమంత పాతకం ♦ బెటులసోఁకు!
బిల్వమాహాత్మ్యంబు ♦ విని పదునాఱేండ్లు
మారేడు తోఁటలో ♦ మ్రగ్గియుంటి!
గీ॥ బాల్యమందె రుద్రాక్షపా ♦ వనత యెఱిఁగి
ముదురు రుదురాకప్రోవుల ♦ మోసినాఁడ!
నాకు నిసుమంత పాప మం ♦ టంగఁగలదె!
చీఁకటులు సూర్యబింబంబు ♦ సోఁకఁగలవె! 183
సీ॥ తిరుపతివెంకటే ♦ శ్వరు పెరుమాళ్లకు
గరటాలవానిఁ గా ♦ న్కగ నొసఁగితి!
నల యహోబలసీమఁ ♦ గల కంబమయ్యకు
జిబ్బడాయిని గటా ♦ క్షించియుంటిఁ!
గాశికాపురిఁ బెద్ద ♦ కాత్రేని కుదురైన
రెంటెమొక్కఁడు సమ ♦ ర్పించియుంటి!
విద్దెలపురి మొద్దు ♦ పిళ్లారి కొకకోడి
పిల్ల నైవేద్యంబుఁ ♦ బెట్టియుంటిఁ!
గీ॥ బయినఁ బాతాళగంగాభ ♦ వాని మెడను
బడుగు రొయ్యలదండలు ♦ వైచియుంటి!

నవని నష్టోత్తరసహస్ర ♦ యాత్ర లరిగి
నట్టి నన్నెట్టు పాపముల్ ♦ ముట్టఁగలవు! 184

గీ॥ ధనము వెచ్చింపకుండ నెం ♦ తయును బుణ్య
మార్జనముసేయు త్రోవ లే ♦ నరయుచుందుఁ!
జిల్లిగవ్వయునేని వె ♦ చ్చించు టనిన
లేమ! నాప్రాణములు పైకి ♦ లేచిపోవు! 185

క॥ ననుఁ గని సహస్రకుల పా
వనుఁడని జగమందు జనులు ♦ ప్రణుతింతురు! భా
మిని! నను మగనిగఁ గొనఁ గ
ల్గిన జగమున్నంతదాకఁ ♦ గీర్తి నిలిచెడుఁ! 186

క॥ అఱువదినాలుగు దేశము
లరసితి! నందలి చెలువల ♦ నరసితి! నం దొ
క్కరి తెఱయు నందము చందము
తెలుఁగదు! ముదికోతు లట్టు ♦ లిగిలింత్రు సుమీ! 187

సీ॥ జల్లెడ మొగములు ♦ పల్లమొగంబులు-
తిరుగలి మొగములు ♦ తిక్క మొగము-
లేనిక మొగములు ♦ నిగిలింత మొగములు-
కోల మొగంబులు ♦ కుండ మొగము-
లంగలార్చు మొగంబు ♦ లడవ మొగంబులు-
గొడ్డలి మొగములు ♦ కుఱుచ మొగము-
లింగలాయిమొగంబు ♦ లేతాము మొగములు
కొడవలి మొగములు ♦ కురువ మొగము-

గీ॥ లెగుడు దిగుడు మొగంబులు ♦ నెడ మొగములు
పంగమొగములు వాఁడి అం ♦ పపు మొగములు-
ధరణిఁ దిరుగాడు సామాన్య ♦ తరుణులందు
నిన్నిగతుల మొగాలని ♦ యెవ్వఁ డెఱుఁగు! 188

సీ॥ కంకరగుండు తూ ♦ కంబుండు రకము - కం
డె కదరుమాడ్కి ♦ రాణించు రకము-
పసరికపాముట్లు ♦ నసిగల రకము - చూ
పులఁ దూలిపోవు దు ♦ ర్బలపురకము-

